శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# వేదవైభవం-5

(నావల్ పాక్కమ్ యజ్ఞ వరాహాచార్య(కణ్ణన్)స్వామి వారి ఉపన్యాసం ఆధారంగా)



యోగనరసింహ స్వామి, గజగిరి క్షేత్రం, మదురై



'పండితరత్న' డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళ్గగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయ సూచిక

# వేదపుష్పం

"వేదం పుష్పంవంటిది" అనే సామ్యాన్ని ఆధారంగా చేసికొని వేదమహిమను తెలుసుకుందాం. వేదం పుష్పంవంటిది అనే సామ్యం ఉపనిషత్తులలో, పురాణాలలో, ఆ విధంగానే, దేశికస్తోత్రంలో మనకు గోచరిస్తుంది.

చాందోగ్యోపనిషత్తులోని ఐదవ అధ్యాయంలో మధువిద్య అనే ఒక బ్రహ్మవిద్య ప్రస్తావింపబడింది. ఆ చోట "ఋగ్వేద ఏవ పుష్పం యజుర్వేద ఏవ పుష్పం సామవేద ఏవ పుష్పం" అని ఈ విధంగా ఒక వాక్యం ఉన్నది. పుష్పాని, వేదానికి పుష్పానికి మధ్య ఎటువంటి సామ్యాలు ఉన్నాయి? అని ఆలోచిస్తే, మనకు ఇక్కడ ఒక విధమైన సామ్యం గోచరిస్తుంది. రెండిటిలోనూ తేనె అనేది ఉన్నది అనేది అది. ఇక్కడ పుష్పం, తేనె, తుమ్మెద– అనే వీటిని గూర్చిన ప్రస్తావన ఉపనిషత్తులలో వచ్చినందున వేదానికి, పుష్పానికి మధ్య సామ్యం ఇక్కడ చెప్పబడినట్లు అయినది.

దేశికులు అనుగ్రహించిన గోదాస్తుతిలో వేదాన్ని పుష్పంగా అభివర్ణించే ఒక శ్లోకం ఉన్నది. , "అర్చ్యం సమర్చ్య నిగమైః నిగమప్రసూనైః నాథం త్వయా కమలయా చ సమేయివాంసమ్, మాతః చిరం నిరవిశన్ నిగమాధిరాజ్యం మాన్యా మనుప్రభృతయోఽపి మహీక్షిత స్తే" అనేది ఆ శ్లోకం. ఈ శ్లోకంలో "నిగమప్రసూనైః" అనే ఒక పద ప్రయోగం ఉన్నది. నిగమం అంటే– వేదం. ప్రసూనం అంటే– పుష్పం. మనువు మొదలైన మహారాజులు అందరూ శ్రీదేవి భూదేవి అనే ఇద్దరు పత్నులలో కలసి ఉండే భగవంతునకు వేదపుష్పాలలో అర్చన చేసి దాని ఫలంగా తమ రాజ్యాధికారాన్ని పొందారు– అని ఈ శ్లోకంలోని అర్థం. వేదం అనే పుష్పంతో మనం భగవంతుని ఆరాధించినట్లయితే, మనువు మొదలైనవారు మహా సామ్రాజ్యాన్ని పొందినట్లుగా, మనం కూడా గొప్ప అధికారాన్ని పొందవచ్చు– అనే ఒక విధమైన వేదమహిమ దీనివల్ల తెలుస్తున్నది.

ఈ విధంగా వేదానికి, పుష్పానికి మధ్య ఉండే రెండు విధాలైన సామ్యాలను మనం గమనించాం. మధువు అనేది ఈ రెండిటి నుండి స్రవిస్తున్నందున, భగవంతుని అర్చించడానికి ఉపకరణం అవుతున్నందున వేదం పువ్వు వంటిది అని మనం గ్రహిస్తున్నాము. మనం భగవంతుని ఆరాధన చేసే సమయంలో కూడా, మంత్రపుష్పం అనే పేరుతో "ఓమ్, అగ్నిమీళే పురోహితమ్" అని మొదలైన వేదమంత్రాలతోనే భగవంతుని అర్చిస్తున్నాము. అక్కడ మంత్రాలే పుష్పాలు అవుతున్నాయి.

పెరియాల్వార్లు వేదపుష్పాన్ని "వేదనాణ్ మలర్" అనే పేరుతో నిర్దేశించారు. "నాణ్ మలర్" అంటే— అప్పుడే పూసిన నూతనమైన పుష్పం— అని అర్థం. అయితే, ఈ ప్రయోగాన్ని కొంతమంది ఆక్షేపించవచ్చు. వేదం చాలా ప్రాచీనమైనది కదా. అది అనాది కదా. "పండై నాన్మఱై" అని, " తొన్మఱై" అని, " ఆదిమఱై" అని అన్నట్లు తన ప్రాచీనతయే ఒక విలక్షణమైన మహిమగా కలిగినది, వేదం. వేదాన్ని పుష్పంతో సమానంగా చెబితే చెప్పవచ్చు గాని, అభినవమైన పుష్పంతో పోల్చడం ఏ విధంగా సరిపోతుంది? అని కొందరు ప్రశ్నించవచ్చు. మరి ఈ విధంగా కొందరు ఆక్షేపించే అవకాశం ఉన్నప్పుడు పెరియాళ్వార్లు ఎందువల్ల ఈ విధంగా వేదాన్ని నూతనమైన పువ్వుతో పోల్చారు? అని మనం ఆలోచించవలసి ఉన్నది. నూతనమైన పుష్పానికి ఉండే నూతనత్వం అనేది వేదానికి లేకపోయినప్పటికీ, పాతబడిన పుష్పానికి లేని, నూతనమైన పుష్పానికి మాత్రం ఉండే సువాసన, సౌకుమార్యం, తేనె అనేవి వేదానికి కూడా ఉన్నందున, నూతనమైన పుష్పంతో ఆళ్వారులు దానిని పోల్చారు. వారు, "ఉణ్ణానాళ్ పశి యావదొన్ఱిల్లై" అని ఆరంభం అవుతున్న పాశురంలో " ఇరుక్కిశై చ్చామవేదమ్ కొండు ఉన పాదమ్ నణ్ణా నాళవై తత్తురుమాకిల్"అని అన్నారు. ప్రతి దినం వేదపుష్పంతో భగవంతుని పూజించడం అనేది వారి అలవాటు. దానికి కొన్ని సమయాలలో విఘ్నం కలుగవచ్చు. ఏ విధంగా అంటే, ఆశౌచం కలిగిన సమయాలలో భగవంతుని ఆరాధించే అవకాశం ఉండదు కదా. అటువంటి దినాలలో ఆళ్వారులు

చాలా బాధపడతారట. లోకంలోనివారు ఆహారం భుజించని దినాలలో ఏ విధంగా బాధపడతారో, ఆ విధంగానే, ఆళ్వారులు తాము భగవంతుని వేద పుష్పాలతో ఆరాధించని దినాలలో తపిస్తారట. " అన్దు ఎనక్కవై పట్టినినాళే" – "అవి నాకు ఉపవాసం చేసిన దినాలే అవుతాయి" అని అంటున్నారు, వారు. మనం కూడా ప్రతి దినం భగవంతుని ఆరాధించే సమయంలో వేదసూక్తాలను అనుసంధిస్తున్నాము. వేద పుష్పాలతో అర్చిస్తున్నాము. వాటితోపాటు పుష్పాలను కూడా సమర్పించి, అర్చిస్తున్నాము. ఈ విధంగా మంత్రం, పుష్పం అనే రెండు ఉంటాయి కనుక, మంత్రపుష్పం అనే పేరు ఈ విధంగా కూడా సార్ధకం అవుతున్నది.

పెరియాళ్వారుల సూక్తిని సేవిస్తే, వేద మంత్రమే పుష్పం కావడం మనకు తెలుస్తున్నది. ఇక్కడ ఇంకొక చమత్కారాన్ని కూడా మనం గమనించవచ్చు. వేదం పుష్పంవంటిది అని చెప్పేటప్పుడు, చాందోగ్యం చెప్పే సామ్యం ఏమంటే, అది జిహ్వకు చాలా భోగ్యంగా ఉన్నది–అని. పుష్పం ఏ విధంగా తన తీయని తేనెతో తుమ్మెదలకు భోగ్యతను కలిగిస్తుందో, ఆ విధంగానే, వేదంకూడా తన శబ్దమాధుర్యంతో, స్వరమాధుర్యంతో మనకు భోగ్యతను కలిగిస్తున్నది.

మార్కండేయ పురాణంలో ఒక శ్లోకం ఉన్నది. ఆ శ్లోకం వేదంపూవువలె కంటికి ఇంపుగా ఉంటుంది అని తెలుపుతున్నది. ఎర్రని రంగును కలిగిన జపా పుష్పం, తెల్లని రంగును కలిగిన కుందపుష్పం అనేవి క్రమంగా ఋగ్వేదానికి, యజుర్వేదానికి ఉపమానాలు– అని అంటున్నది. ఈ విధంగా వేరు వేరు వర్ణాలతో వేదం అందాన్ని పొందుతున్నది – అని అంటున్నది.

ఈ విధంగానే, భాగవతపురాణంలో ఉండే ఒక శ్లోకం వేదం భగవంతుని పాదపద్మ నుండి సువాసనను గ్రహించి తీసికొని రావడంచేత పుష్పం వలె ముక్కుకు ఆనందాన్ని కలిగిస్తున్నది– అని అంటున్నది. వాస్తవానికి, వేదం పుష్పంవలె కాకుండా, చెవికి

మాత్రమే ఆనందాన్ని కలిగిస్తున్నది అనే విషయం సాధారణంగా మనకు తెలుసు. అయితే, వేదం పుష్పం వలె జిహ్వకు, చెవికి, కంటికి, ముక్కుకు కూడా ఆనందాన్ని కలిగిస్తున్నది– అనే విషయాన్ని ఇంతకు ముందు ప్రస్తావించిన సూక్తులను బట్టి ఏర్పడుతున్నది. ఈ విధంగా, వేదపుష్పం జ్ఞానేంద్రియాలు నాల్గింటికి మాత్రమే కాకుండా, వాక్కు, చేయి అనే రెండు కర్మేంద్రియాలకు కూడా హితాన్ని కలిగిస్తున్నది –అని అంటున్నారు, . మన పూర్వాచార్యులు. పుష్పంతో భగవంతుని అర్చించినట్లుగా, వేదపుష్పంతో భగవంతుని అర్చించి, మనం హితాన్ని పొందవచ్చు– అని వారు అంటున్నారు.

గోదాస్తుతిలోని, పైన ప్రస్తావించిన శ్లోకం వేదపుష్పాలతో భగవంతుని ఆరాధించడం వల్ల మనువు మొదలైనవారు ఆధిరాజ్యాన్ని పొంది ఆనందించారు– అని చెబుతున్నది. పెరియాళ్వార్లు, వేదమనే పుష్పాలతో భగవంతుని ఆరాధించని నాడు తమకు ఉపవాస దినం– అని అన్నారు. అంటే, షడ్రసోపేతమైన పదార్థం ఇచ్చే ఆనందాన్ని వేదం కలిగిస్తుందని అన్నారు. నమ్మాళ్వార్లు " పావియల్ వేదనన్మాలై పల కొండు దేవర్ గళ్ మామునికళ్ ఇఱైంజ నిన్ఱ" అని అన్నారు. మానవులకు మార్గదర్శకులైన దేవతలు కూడా భగవంతుని వేదమనే పుష్పాలతో అర్చించడం కోసం ఏ పూలమాలికలను తీసుకొని వెళుతున్నారు? అని అంటే, వేదమనే పూలమాలికలనే గ్రహించి వెడుతున్నారు– అని అంటున్నారు, అళ్వారులు. అంటే, వేదంలోని మంత్రాలతో వారు భగవంతుని స్తుతించి ఆరాధిస్తున్నారు. దీనివల్ల ఇక్కడ వేదానికి, పుష్పానికి మధ్య ఇంకొక సామ్యం స్ఫురిస్తున్నది. అది ఏమంటే, భగవంతుని ఆరాధించడంలో వేదం, పుష్పం అనే ఈ రెండు ఉపకరణాలు అవుతున్నాయి– అని. పలు పువ్వులను వరుసగా కూర్చి మాలగా కట్టినపుడు భగవంతునకు సమర్పించడానికి ఇంకా అధికమైన అర్హతను పొందేటట్లే, పలు వేదమంత్రాలను కూర్చి ఒక మాలగా చేసి, దానితో భగవంతుని అర్చిస్తే, అది భగవంతుని ఆరాధించడానికి ఉపకరణం కావడంలో ఇంకా అధికమైన అర్హతను పొందుతున్నది–అని ఇక్కడ చెప్పినట్లయినది.

## వేదవైభవం-5

ఈ విధంగా ఇంద్రియాలకు ఆనందాన్ని కలిగించి, భగవంతుని సమర్పించి, పుణ్యాన్ని కలిగిస్తున్నందున పూవువంటిది వేదం అయినది.

“వేదం పువ్వువంటిది” అనే సామ్యాన్ని బట్టి మనం ఇంతవరకు గమనించిన వేదమహిమలు ఏమి? అంటే, వేదం కేవలం శ్రవణేంద్రియానికి మాత్రమే కాకుండా, మిగిలిన ఇంద్రియాలకు కూడా ఆనందాన్ని కలిగిస్తున్నది– అని, భగవంతుని అర్చించడానికి వేదమంత్రాలు గొప్ప ఉపకరణాలు –అని, దేవతలు, మునులు కూడా వేదాన్ని పురస్కరించుకునే భగవంతుని ఆరాధిస్తున్నారు– అని. ఈ విధంగా మనం వేదమహిమను తెలిసికొని, వేదపుష్పాలతో భగవంతుని భక్తితో ఆరాధించి, ఆ స్వామి అనుగ్రహాన్ని పొందుదాం. స్వస్తి.

# వేదం శ్రీమహాలక్ష్మి

"వేదం మహాలక్ష్మి వంటిది" అనే సామ్యాన్ని అనుసరించి వేదవైభవాన్ని తెలుసుకుందాం.

వేదం మహాలక్ష్మివంటిది అనే సామ్యాన్ని ఎవరు తెలియజేశారు? అని అంటే, వేదమే స్వయంగా తెలియజేస్తున్నది. అంతేకాక, యతిరాజసప్తతి, లక్ష్మీ సహస్రనామస్తుతి, ఇంకా మరి కొన్ని గ్రంథాలు ఈ విషయాన్ని తెలుపుతున్నాయి.

ముందుగా, దేశికుల యతిరాజ సప్తతి సూక్తిని గమనిద్దాం. ఆ స్తుతిలో వారు భగవద్రామానుజులను స్తుతిస్తూ, ఒక తనియన్ శ్లోకాన్ని అనుగ్రహించారు. ఆ శ్లోకం ఏమంటే, " ప్రణామం లక్ష్మణమునిః ప్రతిగృహ్ణాతు మామకమ్, ప్రసాధయతి యత్సూక్తిః స్వాధీనపతికాం శ్రుతిమ్" అనేది ఆ శ్లోకం. ఈ శ్లోకంలో మనకు ప్రస్తుతం ఆవశ్యకమైనది "స్వాధీన పతికాం శ్రుతిమ్" అనే సూక్తి.

వేదం అనేది ఒక కాంత. ఆమె స్వాధీనపతిక. కావ్యనాయికలలో స్వాధీన పతిక అనే ఒక నాయకి ఉన్నది. తన పతిని తన స్వాధీనంలో పెట్టుకోగలిగిన నాయిక పేరు ఇది. ఈ వేదకాంత అనే స్వాధీనపతికకు ఎవరు పతి? అని అంటే, భగవంతుడైన శ్రీమన్నారాయణుడే. " నిత్యాస్స్వయంవరపతిః వ్యపహాంత్వనిత్యామ్" అని శతదూషణి అనే గ్రంథంలో దేశికులు ఒక శ్లోకాన్ని అనుగ్రహిస్తూ, నిత్య అయిన వేదానికి స్వయంవరపతి. భగవంతుడే అని అన్నారు. స్వయంవర పతి అంటే తానుగా వరించిన భర్త. అంటే, వేదకాంత తనకు భర్తగా భగవంతుని తానే వరించింది– అని భావం. ఈ విధంగా వేదమనే కాంతకు భర్త శ్రీమన్నారాయణుడు అయినందున, ఆమె లక్ష్మితో సమానమైనదని ధ్వనిస్తున్నది.

# వేదవైభవం-5

పూర్వకాలంలో మహారాణులకు సైరంధ్రులు అనే పేరు కలిగిన సేవకురాండ్రు ఉండేవారు. వారు మహారాణులకు తల దువ్వి, చక్కగా అందంగా అలంకరించేవారు. విరాట రాజు పత్నికి ద్రౌపది సైరంధ్రియై, ఆమెకు సేవలను చేసిన కథ మహాభారతంలో ప్రసిద్ధం కదా. "రాజాధిరాజః సర్వేషామ్" అనే విధంగా రాజాధిరాజు అయిన భగవంతునకు పత్ని అయిన వేదకాంతకు కూడా ఈ విధంగా కొంతమంది సైరంధ్రులు ఉంటారుకదా. వారు ఎవరు? అంటే, భగవద్రామానుజులు అనుగ్రహించిన శ్రీ సూక్తులే— అని అంటున్నారు, దేశికులు. శ్రీ భాష్యకారులు పలికిన శ్రీసూక్తులు అనే సైరంధ్రులు వేదకాంత అనే మహారాణిని అందంగా సింగారిస్తున్నారు. వేదకాంతకు శుశ్రూషను చేస్తున్నారు.

యతి రాజుల సూక్తులు అనే సైరంధ్రులు వేద కాంతను ఏ విధంగా అలంకరిస్తున్నారు? అని అంటే—

ఇంతకు ముందు వేదకాంత విషయంలో కొంతమంది అపచారం చేశారు. ఆమె అందానికి వైభవానికి, లోటును కలిగించారు. క్లేశాన్ని కలిగించారు. ఏ విధంగా? అంటే, వేదంలోని అర్థాలకు అపార్థాలను చెప్పి, ఆమెకు విరూపాన్ని కలిగించారు. కానీ, శ్రీ రామానుజల శ్రీసూక్తులు వేదకాంత సంతోషించే విధంగా తగిన విధంగా అందమైన అర్థాలను తెలియజేసి ఆమెకు అలంకారం చేసిన విధంగా శోభను కలిగించారు. ఆమె అందాన్ని బహుగుణీకృతం చేశారు. ఈ విధంగా వేద కాంతను అందంగా అలంకరించడంలో ఆమె శోభను పెంపొందించడంలో సామర్థ్యాన్ని కలిగిన శ్రీరామానుజుల సూక్తులు సైరంధ్రుల వంటివి అయినవి. మహాలక్ష్మి అనదగిన వేదకాంతకు అవి అద్వితీయమైన అందాన్ని కలిగించాయి. ఇటువంటి సూక్తులను అనుగ్రహించిన భగవదారామానుజులకు నేను నమస్కరిస్తున్నాను — అని పై దేశికుల శ్లోకంలోని భావం.

# వేదం శ్రీమహాలక్ష్మి

పై శ్లోకం వల్ల మనకు— వేదం భగవంతునకు పత్నివంటిది. —అని, సాధారణ పత్ని కాదు, స్వాధీన పతిక అయిన పత్ని— అని ఏర్పడుతున్నది.

ఇక్కడ మనం మహాలక్ష్మి, కి, వేదానికి మధ్య ఉండే ఐదారు చక్కని సామ్యాలను గమనించవచ్చు. మొదటి సామ్యం ఏమంటే, ఈ ఇద్దరూ శుచి అయినవారు, మంగళకరమైనవారు— అనేది. శుచి అంటే పవిత్రమైనది— అని అర్థం. లక్ష్మీదేవి "శుచిం స్వాహాం స్వధాం సుధామ్" అని లక్ష్మీ అష్టోత్తర శతనామ స్తోత్రంలో "శుచి" అని చెప్పబడుతున్నది. మనలను పరిశుద్ధులను చేసేది, శుద్ధి కలిగిన చోట్ల నివసించేదికదా, లక్ష్మీదేవి. వేదం కూడా శుచి అయినదే. మనకు ఏ కారణం చేతనైనా అపవిత్రత కలిగితే, ఆ అపవిత్రతను పోగొట్టగలిగినది వేదమే కదా. వేదం ద్వారా ప్రాయశ్చిత్తాన్ని చేసుకోవచ్చు. వేదాన్ని "అపహతపాప్మా వేదపవిత్రమ్ " అని వేదమే పలుకుతున్నది. అంతటి శుచి అయినది, వేదం.

లక్ష్మి మంగళదేవత. "మాతః! మంగళ దేవతే!" అని ఆమె మంగళ దేవతగా ప్రసిద్ధి చెందినది. వేదాన్ని "మంగళమ్ శేర్ నాన్మఱై" అని మంగళకరంగా ఆళ్వారులు కీర్తించారు.

ఇంకొక సామ్యం ఏమంటే— ఈ ఇద్దరికీ దైవీస్వభావం ఉన్నది. " దైవీం వాచ మజనయంత దేవాః" అనే విధంగా వేదం దైవీ వాక్. మహాలక్ష్మి కూడా "దంపతీ దైవతం నః" అని దైవీస్వభావాన్ని కలిగినది.

వేదం, లక్ష్మీదేవి అనే ఇద్దరు స్వాధీన పతికలు —అనేది ఇంకొక సామ్యం. మహాలక్ష్మి స్వాధీన పతిక ఏ విధంగా అవుతున్నది? అని అంటే, భగవంతుడు ఆమె ఇంగితాలను, అభిప్రాయాన్ని గమనించియే సృష్టి స్థితి లయాది సమస్త కార్యాలను చేస్తున్నాడు. అంతటి పరిమితిలో ఆమె తన భర్తను తనకు స్వాధీనం చేసుకున్నది. "యద్భ్రూభంగాః

ప్రమాణం స్థిరచరరచనా తారతమ్యే మురారేః" అని అన్నారు భట్టర్. వేదం కూడా స్వాధీన పతిక ఏ విధంగా అయినది? అని అంటే, "మంత్రాధీనం తు దైవతమ్" అనే విధంగా భగవంతుడు మంత్రానికి అధీనుడు. వేదం మంత్రరూపమైనది కదా. కనుక వేదమంత్ర ప్రతిపాద్యుడైన భగవానుడు ఆ వేదానికి అధీనుడు—అని తెలుస్తున్నది కదా.

ఈ ఇద్దరి మధ్య ఉండే మరి ఒక సామ్యం ఏమంటే, పారార్థ్యం అనేది. పతికి పత్ని పరార్థమై ఉంటుంది, పరతంత్రగా ఉంటుంది. అంటే, తన జీవితం, సర్వస్వం పతికే చెందినదని భావించి సమర్పిస్తుంది. "కొండానై యల్లాల్ అఱియా క్కులమకళ్ పోల్" (తనను గ్రహించిన పతిని తప్ప వేరొకనిని తెలియని కులసతి వలె) అని కులశేఖరాళ్వారులు అంటారు. ఆ విధంగా మహాలక్ష్మి భగవంతునకు పరతంత్రయై ఉంటుంది. శ్రుతి కూడా ఆ విధంగానే భగవంతునకు పరతంత్ర. " సర్వే వేదా యత్పదమామనంతి" అని, "వేదైశ్చ సర్వైః అహ మేవ వేద్యః" అని చెప్పబడే విధంగా భగవంతుని కోసంగానే వేదాలు ఉన్నాయి.

వేరొక విధమైన సామ్యం ఏమంటే, మహాలక్ష్మి భగవంతునకు ప్రేయసి అయినందున, ఆమె శ్రుతిలో, అంటే, చెవిలో భగవంతుడు మాటిమాటికి పలుకుతాడు. శ్రుతి అనబడే వేదంలో కూడా భగవంతుడే పలుకుతున్నాడు. భగవంతుని ఆజ్ఞా రూపాలే కదా వేదాలు. ఇది కూడా ఒక విధమైన, చమత్కార రూపమైన సామ్యం.

ఈ ఇద్దరికీ నామసామ్యం కూడా ఉన్నది. శ్రుతి అనే పేరు మహాలక్ష్మికి ఉన్నది. లక్ష్మి అనే పేరు వేదానికి ఉన్నది. అది ఏ విధంగా? అంటే, లక్ష్మీ సహస్రనామ స్తోత్రంలో "ఓం శ్రుతయే నమః, ఓం వేదరూపాయై నమః" అనే నామాలు లక్ష్మీదేవికి ఉన్నవి. ఆ విధంగానే, వేదానికి లక్ష్మి నామం ఏ విధంగా ఉన్నది అంటే, వేదమే "ఋచో యజూంషి సామాని, సా హి శ్రీ రమృతా సతామ్" అని అంటూ ఋగ్వేద యజుర్వేద సామవేద

రూపమైన వేదం శ్రీః అని అంటున్నది. అమృత రూపమైన శ్రీ వేదమే– అని వేదమే తెలుపుతున్నది. ఇది నామసామ్యం.

ఈ విధంగా వేదానికి లక్ష్మీదేవికి మధ్య పలు ప్రకారాలుగా సామ్యం ఉన్నదని తెలిసి, తద్వారా వేదానికి శుచిత్వం, మాంగల్యం, పరిశుద్ధి, దైవత్వం, స్వాధీనపతికాత్వం, పారార్థ్యం మొదలైన పలు మహిమలు ఉన్నట్లు మనం గుర్తించాముకదా. వేదమే లక్ష్మి, లక్ష్మియే వేదం.

ఓమ్ వేదరూపాయై మహాలక్ష్మ్యై నమః

# వేదధనం

"వేదం ధనంవంటిది" అనే పోలికను ఆధారంగా చేసికొని వేదవైభవాలను తెలిసికుందాం.

వేదాన్ని ధనంగా చెప్పినవారు ఎవరంటే, వేదమే చెబుతున్నది. అంతేకాక, వ్యాసుడు, భీష్ముడు, బ్రహ్మ, నమ్మాళ్వార్లు, తిరుమంగై యాళ్వారులు– అని ఈ విధంగా ఆరుగురు ఈ విషయాన్ని తెలియజేశారు.

ముందుగా, ద్రావిడ వేదంలో వేదం ధనంవంటిది– అని ఏ విధంగా చెప్పబడిందో చూద్దాం. నమ్మాళ్వారులు అనుగ్రహించిన తిరువాయ్ మొళి ప్రబంధంలో " మల్లై చ్చెల్వ వడమొ*ళ్లి* మఱైవాణర్" అనే ఒక సూక్తి ఉన్నది. తిరుప్పులియూర్ అనే దివ్యదేశాన్ని కీర్తించే సందర్భంలో వేదాన్ని పలు విధాలుగా పొగడుతూ నమ్మాళ్వార్లు పలికారు. ఇక్కడ ఉదాహరించిన సూక్తిలోని "మల్లై" అనే పదానికి బలం, సమృద్ధి, పుష్టి అని అర్థం. "మల్లై చ్చెల్వమ్" అంటే– సమృద్ధమయిన సంపద– అని అర్థం. " మల్లై చ్చెల్వ" అనే విశేషణాన్ని "వడ మొ*ళ్లి*" అనే పదంలో అన్వయిస్తే, వేదానికి కల శబ్దపుష్టి చెప్పబడుతుంది. శబ్దపుష్టిని కలిగి ఉండడం అనేది వేదంలో అధికం. వేదభాష అటువంటిది. "మల్లై చ్చెల్వ" అనే విశేషణాన్ని "మఱైవాణర్", అనే పదంలో అన్వయిస్తే, ఆ దివ్యక్షేత్రంలో ఉండే వేదవేత్తలు లోకంలో ఉండే ధనం కంటే వేదమనే ధనాన్ని గొప్పధనంగా భావిస్తున్నారు– అనే అర్థం వస్తుంది. దీనివల్ల ఇక్కడ వేదమహిమ వ్యక్తం చేయబడుతున్నది. ఇంతే కాక, తిరుప్పులియూర్ అనే క్షేత్రానికి కలిగిన గొప్పతనం అక్కడ ఉండే వేదవేత్తల వల్ల ఏర్పడినది– అని ఇక్కడ చెప్పడం వల్ల, ఒక ఊరుకు గొప్పతనాన్ని కలిగించే మహిమ వేదం అనే ధనానికి ఉన్నది– అని చెప్పినట్లు అయినది. ఇది ద్రవిడవేదం సంస్కృత వేదమహిమను తెలిపిన ప్రకారం.

ఇక, వేదమే తన మహిమను తెలియజేసిన రీతి ఏమంటే, "ఋచో యజూంషి సామాని సా హి శ్రీ రమతా సతామ్" అని వేదం పలకడం ద్వారా వేదమనేది అమృత రూపమైన సంపద–– అని వేదమే తెలుపుతున్నది. అమృత అంటే –నశించనిది –అని అర్థం. అంటే, వేదం నశించని సంపద– అని అర్థం. దీనివల్ల లోకంలో నశించే స్వభావం కలిగిన సంపద కంటే వేదమనే సంపదకు కల వైలక్షణ్యం చెప్పబడింది. "సతామ్" అని అన్నందువల్ల, ఇది సత్పురుషుల సంపద– అని చెప్పబడింది. " హి" అనే పదం చేత ఈ "ఈ విషయం ప్రసిద్ధమైనది"– అని తెలుపబడింది. ఈ విధంగా తన మహిమను వేదం తానే స్వయంగా కంఠతః స్పష్టం చేస్తున్నది. దీనివల్ల ఇక్కడ ధనికునకు, వేదవేత్తకు గల సామ్యం కూడా చెప్పబడినట్లయినది.

లోకంలో ధనికుని మాటను అందరూ వింటారు, గౌరవిస్తారు ఎందుకంటే, అతని వల్ల చాలామందికి లాభం కలిగే అవకాశం ఉన్నది కనుక, ఆ విధంగానే, వేదవేత్తలు చెప్పిన మాటను కూడా మనం వినాలి, వినడం మనకు లాభకరం– అనే విషయం కూడా ఇక్కడ సూచింపబడింది. ఎందుకంటే, తన మాటను వినినవారికి వేదవేత్త వేదం ద్వారా సహాయపడతాడు. మహాభారతంలోని శాంతిపర్వంలో ఈ విషయం ప్రస్తావింపబడింది. "బ్రాహ్మణాన్ శ్రుతసంపన్నాన్ తాన్నిబోధ నరాధిప!" ఓ ధర్మరాజా! బ్రాహ్మణులలో ఎవరు శ్రుతి అనే సంపదను కలిగినవారై ఉన్నారో, వారి మాటను నీవు ఆలకించు, మన్నించు–. అని భీష్ముడు అన్నాడు. వేదవిదుల మాటను మన్నించినట్లయితే, హితం కలుగుతుంది– అని దీని భావం.

అంపశయ్యపై భీష్ముడు శయనించి ఉన్నాడు. అతని దగ్గర ధర్మాలను వినాలని ధర్మరాజు అతని దగ్గరకు వచ్చాడు. ఆ విధంగా ధర్మోపదేశాన్ని చేయమని శ్రీకృష్ణుడు కూడా భీష్ముని ప్రోత్సహించాడు. కానీ, భీష్ముడు సందేహ పడ్డాడు. ఎందుకు సందేహపడ్డాడంటే, ఆ సమయంలో అతడు మరణశయ్యపై ఉన్నాడు. అటువంటి

సమయంలో ఎవరికైనా స్మృతిభ్రంశం కలిగే అవకాశం ఉన్నది. జ్ఞానం మరపుకు వచ్చే సమయం, అది. అటువంటి దశలో నేను ఏ విధంగా ఉపదేశం చేయగలను? అని భీష్ముడు సందేహించాడు. అప్పుడు శ్రీకృష్ణుడు అతనిని ప్రోత్సహిస్తూ, " నీకు నేను ధర్మోపదేశాన్ని చేయడానికి ఆవశ్యకమైన బుద్ధిని, శక్తిని నీకు అనుగ్రహిస్తున్నాను. నా అనుగ్రహం చేత నీకు కల జ్ఞానం వికసిస్తుంది. ఇంకా అభివృద్ధి చెందుతుంది. ఏ సందేహం లేకుండా ధర్మరాజునకు ధర్మాన్ని ఉపదేశించు" అని అన్నాడు. ఆ సమయంలో భీష్ముడు ధర్మరాజునకు చేసిన ఉపదేశాలలో ఇది ఒక ధర్మోపదేశం. "వేదసంపన్నులను నీకు ఆలోచననను చెప్పేవారినిగా, మంత్రులుగా ప్రభువులు ఏర్పాటు చేసికోవాలి. దానివల్ల హితం కలుగుతుంది" అనేది ఈ ఉపదేశంలోని తాత్పర్యం

మహాభారతంలో శాంతిపర్వంలో మోక్ష ధర్మంలో హయశిర ఉపాఖ్యానం ఉన్నది. ఈ వృత్తాంతం విద్యాధిదేవత అయిన హయగ్రీవునకు సంబంధించినది. ఆ వృత్తాంతంలో మధుకైటభులు అనే అసురుల వల్ల వేదాలను కోల్పోయిన బ్రహ్మ "వేదా మే పరమం చక్షుః వేదా మే పరమం ధనమ్" అని అంటూ బాధపడ్డాడు. "వేదాలే నాకు గొప్ప నేత్రం, గొప్ప ధనం" అని దీని అర్థం. "పరమం ధనమ్ " అని ఎందుకు చెప్పబడింది? అంటే, సాధారణనేత్రం వల్ల కనిపించని విషయం వేదనేత్రం వల్ల గోచరించేటట్లు, సాధారణమైన ధనం వల్ల సాధించలేని కార్యాన్ని వేదధనం ద్వారా సాధించవచ్చు. అందువల్ల అది "పరమం ధనం" అని చెప్పబడింది. వేదం, ధనం– అనే ఈ రెండు ధర్మసాధనాలు అవుతున్నాయి. ఈ రెండిటి ద్వారా ధర్మాన్ని మనం ఆచరించవచ్చు. సాధించవచ్చు.

ఈ విధంగా వేదానికి, ధనానికి మధ్య సామ్యాలు ఉన్నాయి. ఈ విషయాన్ని భీష్ముడు మహాభారతంలో మరొక చోటకూడా వ్యక్తం చేస్తున్నాడు. " స్పృహయామి ద్విజాతిభ్యో యేషాం బ్రహ్మ పరం ధనమ్" అనే ఈ సూక్తి భీష్ముడు పలికినది. ఇది అనుశాసనిక పర్వంలో ఉన్నది. వేదాన్ని గొప్ప ధనంగా కలిగిన బ్రాహ్మణులను నేను

గొప్పగా గౌరవిస్తాను. వీరు సామాన్యమైన ధనాన్ని గొప్పగా భావించడం లేదు. వేదం అనే ధనాన్నే గొప్పధనంగా భావిస్తున్నారు—. అని భీష్ముడు అంటున్నాడు. వీరివలె తాను కూడా కావాలని తాను ఆశపడుతున్న విషయాన్ని "స్పృహయామి "అనే పదం ద్వారా ఇక్కడ భీష్ముడు సూచిస్తున్నాడు. "ధనం తు బ్రాహ్మణస్యాహుః స్వాధ్యాయం దమ ఆర్జవమ్" అనే ఇంకొక వాక్యం వనపర్వంలో ఉన్నది. బ్రాహ్మణులకు ఏది ధనం?అంటే, వేదాన్ని అధ్యయనం చేయడం, దానివల్ల కలిగే ఇంద్రియ నిగ్రహం, ఋజుత్వం అనేవి తప్ప, లౌకికమైన ధనం నిజమైన ధనం కాదు. —అని ఇక్కడ చెప్పబడింది

ఇంతవరకు మహాభారతంలో చెప్పబడిన, వేదానికి, ధనానికి మధ్య ఉండే కొన్ని సామ్యాలను గమనించాం. ఇవి అన్ని వేర్వేరు ప్రకరణాలలో ఉన్నవి. శాంతిపర్వం, ఆనుశాసనిక పర్వం, వనపర్వం— అని ఈ విధంగా మహాభారతంలో వేరు వేరు సందర్భాలలో గోచరించే సూక్తులను గమనించాం. ఈ విధంగా వేదవ్యాసమహర్షి ఏ కారణం వల్ల మాటిమాటికి వేదధనవైభవాన్ని గురించి ప్రస్తావించాడు? అంటే ఆ మహర్షి దృష్టిలో ఇది చాలా ముఖ్యమైన విషయం. అందుచేత దానిని పలు సందర్భాలలో మాటిమాటికి ప్రస్తావన చేశాడు.

"వేదం ధనంవంటివి" అని అన్నప్పుడు, వేదం అనేది ఉపమేయం, ధనం అనేది ఉపమానం. లోకంలో ఉండేవారికి ధనం ముఖ్యమైనది, ప్రసిద్ధమైనది. ఉపమానంగా నిర్దేశింపబడేది లోకప్రసిద్ధమైనది, ముఖ్యమైనది అయినప్పుడే, ఉపమేయవైభవం సుస్పష్టమవుతుంది. వేదం ధనంవంటివి అని చెప్పినందున లోకంలో ఉండేవారు ఏ విధంగా ధనాన్ని అన్వేషిస్తారో, ఆదరిస్తారో, ఆ విధంగానే, వైదికులుకూడా వేదాన్ని అన్వేషించి, మాటిమాటికి సేవిస్తారు—అని, . లోకంలో ఉండేవారు ధనాన్ని కాపాడుకున్నట్లుగా వైదికులు కూడా వేదాన్ని పరమధనంగా భావించి, కాపాడుకుంటారు— అని, లోకంలో ఉండేవారు ధనం వల్ల తాము ఆశించిన ప్రయోజనం పొందేటట్లు, వైదికులు కూడా వేదం ద్వారా రతాము ఆశించిన ప్రయోజనాన్ని

పొందుతారు—అని, ఈ విధంగా వేదానికి, ధనానికి మధ్య ఉండే పలు సామ్యాలు ఇక్కడ మనకు గోచరిస్తున్నాయి.

ఇక చివరిగా, చివరి ఆళ్వారులు అయిన తిరుమంగై మన్నన్ పెరియ తిరుమొళి ప్రబంధంలో "ఆనాద పెరుమ్ శెల్వత్తు ఆరు మఱైయోర్ నాంగు తన్నుళ్ " అని తిరుత్తేవనార్ తొగై అనే దివ్యక్షేత్రాన్ని కీర్తించే దశకంలో అన్నారు. ఆ ఊరుకు ఏమి విశేషం? అంటే, అక్కడ నివసించే వైదికులవల్ల ఆ క్షేత్రానికి వైభవం కలిగింది—అని ఆళ్వారులు అంటున్నారు. ఈ సూక్తిలో, " ఆనాద పెరుమ్ శెల్వత్తు అరు మఱైయోర్" అని అన్నందు వల్ల, "ఆనాద"— అనే పదానికి "నశించనిది"— అని అర్థం. మిగిలిన ధనాలన్నీ నశించే ధనాలని, వేదధనం ఏనాటికీ నశించని ధనం అని చెప్పబడినట్లయినది. దీనివల్ల ఇక్కడ వేదనిత్యత్వం కూడా సూచింపబడింది. ప్రళయ సమయంలో అన్ని వస్తువులు లయాన్ని పొందిన సమయంలో కూడా, వేదం లయాన్ని పొందలేదని, నిలచి ఉన్నదని సూచింపబడింది. తరువాత, "పెరుమ్ శెల్వమ్" అని అన్నందున వేదం మహాధనమని చెప్పినట్లయినది. వ్యాపారులకు, ప్రభువులకు లభించే ధనం కంటే, వైదికులకు లభించిన వేదమనే ధనం. చాలా గొప్పది— అని సూచింపబడింది. ఆ విధంగానే, "అరు మఱై" అని అన్నందున వేదమనే ధనం చాలా దుర్లభమైనదని, ఎవరికో కొంతమందికి భాగ్యవంతులకు, అదృష్టవంతులకే లభించే ధనమని చెప్పబడినట్లయినది.

ఈ విధంగా, వేదాన్ని ధనంగా ఉపమించినప్పుడు, "పరమం ధనమ్" అని, " అమృతా శ్రీః" అని, " ఆనాద శెల్వమ్" అని, " మల్లై చ్చెల్వమ్" అని ఈ విధంగా ధనం కంటే వేదానికి కల ఆధిక్యం కూడా సూచింపబడడం గమనించవచ్చు. వీటివల్ల వేదం అనేది ఏ నాటికీ నశించని ధనం, గొప్పదైన ధనం. సదా అభివృద్ధి చెందే ధనం. ఉత్తమమైన ధనం, అసాధారణమైన ధనం— అని తెలుపబడినట్లయినది.

# వేదాగ్ని

వేదం అగ్నివంటిది అనే ఉపమానాన్ని అత్రిస్మృతి, బోధాయనస్మృతి, తిరువాయ్ మొழி ప్రబంధం మొదలైన ఎన్నో గ్రంథాలు తెలుపుతున్నాయి.

ముందుగా ఆత్రిస్మృతి వచనాలను గమనిద్దాం. "యథా జాతబలో వహ్నిః దహత్యార్ద్రానపి ద్రుమాన్, తథథా దహంతి వేదజ్ఞాః కర్మజ్ఞం దోషమాత్మనః" –బాగా జ్వలించే బలమైన అగ్ని తడిగా ఉండే వృక్షాలను కూడా దహిస్తుంది. అగ్ని కొంచెంగా ఉంటే, బాగా ఎండిన కట్టెలను మాత్రమే అది దహించగలదు. కానీ, అది బలంగా ఉంటే, తడికట్టెలను కూడా దహిస్తుంది కదా. ఆ విధంగానే, వేదాన్ని తెలిసినవారు తమ కర్మలవల్ల ఏర్పడిన దోషాలను అన్నిటిని దహిస్తున్నారు. ఆర్ద్రాపరాధాలు, అంటే, చాలా తీవ్రమైన పాపాలు ఉన్నప్పటికీ, వాటినికూడా వారు లేకుండా చేస్తారు. వారు, వేదంవల్ల కలిగిన బలం అధికంగా కలిగినవారైతే, ఎటువంటి తీవ్రమైన పాపాలను అయినా దహించగలరు. –అని దీని భావం. ఇక్కడ అగ్నివలె వేదం, కట్టెలవలె పాపం, తడి కట్టెలవలె తీవ్రమైన పాపం ఉన్నాయని చెప్పబడింది.

అగ్ని దేనిని దహిస్తుంది? కట్టెలను దహిస్తుందికదా. వనాలను అరణ్యాలను దహిస్తుంది. వేదం దేనిని దహిస్తుంది? పాపాలను దహిస్తుంది, దుఃఖాలను దహిస్తుంది. తీవ్రమైన పాపాలను కూడా దహిస్తుంది. దీనివల్ల మనకు తెలిసినది ఏమంటే, మన దగ్గర ఉండే వేదాన్ని మనం నియమాలను అనుసరించి, పదిలపరచుకుంటే, అభివృద్ధి చేసికొన్నట్లయితే, ఆ వేదం మన పాపాలను, కర్మలను, దుఃఖాలను తొలగిస్తుంది– అని తెలుస్తున్నది.

బోధాయనమహర్షి తాము అనుగ్రహించిన బోధాయనస్మృతిలో అత్రిమహర్షి చెప్పిన విషయాన్నే వేరు వచనాలతో తెలియజేశారు. అగ్నిరివ కక్షం దహతి బ్రహ్మపృష్ఠ మనాదృతమ్" అనేవి ఆ వచనాలు. ఏ విధంగా అగ్ని రెల్లుగడ్డి, గడ్డి

మొదలైన అక్కరలేని వస్తువులను సులభంగా దహించి వేస్తుందో, ఆ విధంగానే, వేదం మనకు అక్కరలేని వానిని, అంటే, పాపాలను దహిస్తుంది. ఇది అగ్నికీ, వేదానికి మధ్య ఉండే ఒక విధమైన పోలిక.

"ఏవమాత్మకృతం పాపం త్రయీ దహతి దేహినః" అని కూడా అత్రిస్మృతి తెలియజేస్తున్నది. ఏ విధంగా అగ్ని కట్టెలను దహించి భస్మం చేస్తుందో ఆ విధంగానే, వేదం అనేది ఈ జీవుడు చేసిన పాపాలను దహిస్తుంది– అని దీని భావం. దీనివల్ల కూడా వేదం అగ్నివంటిది అని తెలుస్తున్నది. ఈ వచనం వల్ల ఇక్కడ వేరొక సామ్యం తోస్తున్నది. అగ్ని పావనమైనది అయినట్లే, వేదం కూడా పావనమైనది అనేది ఆ సామ్యం. పావనం అంటే, పవిత్రం చేసేది– అని అర్థం. తాను పరిశుద్ధంగా ఉంటూ, తనతో సంబంధం కలిగినవారిని పరిశుద్ధం చేసేది, అగ్ని. అగ్నికి పావకం అనే ఒక పేరు ఉన్నది. ఈ పేరు కూడా పావనం చేసేది– అనే అర్థంలోనే ఏర్పడింది. బంగారం మొదలైన లోహాలను మనం శుద్ధి చేయాలంటే, వాటిని అగ్నిలో పెట్టి పుటం పెట్టి శుద్ధి చేస్తాము కదా. ఆ విధంగా పుటం పెట్టిన లోహం అంతకు ముందు ఉండే దోషాలు తొలగినదై, శుద్ధి అవుతుంది. అగ్ని సహజంగానే శుద్ధిని కలిగినది. "తీర్థోదకం చ వహ్నిశ్చ నాన్యతః శుద్ధి మర్హతః" అనే భవభూతి మహాకవి వాక్యం ఈ విషయాన్ని తెలుపుతున్నది. తీర్థోదకం కాని, అగ్నికాని వేరొక ఏ వస్తువునుండి శుద్ధిని పొందవలసిన అక్కరలేదు. అవి రెండు సహజంగానే పవిత్రమైనవి– అని ఈ వాక్యంలోని భావం. వేదం కూడా సహజంగా పరిశుద్ధమైనదే. అది "అపాహతపాప్మా దేవ పవిత్రమ్" అని అనబడుతున్నది. అది, తాను శుద్ధికిని కలిగినది, ఇతరులకు శుద్ధిని కలిగజేసేది, అగ్నిలో హోమం చేసేటప్పుడు వైదికమంత్రాలతో హోమం చేస్తాము కదా. అపుడు ఉచ్చరింపబడే వేదమంత్రాలు అగ్నిద్వారా మనలను పవిత్రం చేస్తాయి. "శబ్దస్పర్శరూపరసగంధా శుధ్యంతాం, విరజా విపాప్మా భూయాసం స్వాహా" అని మొదలైన మంత్రాలను ఉచ్చరిస్తూ అగ్నిలో హోమం చేస్తే, వ "శుధ్యంతామ్" అని చెప్పిన విధంగా వేదం మనలను పరిశుద్ధులను చేస్తుంది. వేదమంత్రాలకు పరిశుద్ధం చేసే శక్తి స్వభావంగానే ఉన్నది శ్రీరామాయణంలో "ఇత్యుక్త్వా

ప్రాక్షిపద్రాజా మంత్రపూతం జలం తదా " అని సీతా కళ్యాణ సమయంలో కన్యాదానసందర్భంగా జనకచక్రవర్తి విడచిన జలం మంత్రాలవల్ల పవిత్రమైనదని తెలుపబడింది. స్వతఃశుద్ధమైన జలానికికూడా ఈ వేదం అధికమైన శుద్ధిని కలుగ జేస్తున్నది అందువల్లనే ఆళ్వారులు వేదాన్ని "తూమఱై" అని అన్నారు. "పరిశుద్ధమైన వేదం" అని దీని అర్థం. " విశుద్ధానాం వాచామ్ వృషశిఖరినాథః" అని దేశికులుకూడా దయాశతకంలో వేదాలను పవిత్రమైన వాక్కులుగా నిర్దేశించారు. ఈ విధంగా ఇంతవరకు వేదానికి, అగ్నికి మధ్య ఉండే, అనావశ్యకమైన వాటిని దహించడం, పరిశుద్ధి చేయడం– అనే రెండు విధాలైన పోలికలను గమనించాం.

ఇక, మూడవ సామ్యం ఏమంటే, వీటి సంఖ్యలోకూడా ఉండే సామ్యం. వేదాలు మూడు. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం అనే మూడు వేదాలకు కలిపి త్రయీ అని పేరు. అగ్నులు కూడా మూడే, గార్హపత్యం, ఆహవనీయం, దక్షిణాగ్ని– అనే మూడు అగ్నులు త్రేతాగ్ని అని అనబడుతున్నాయి. ప్రసిద్ధమైన ఈ విషయాన్ని అమరకోశకారుడు కూడా "దక్షిణాగ్నిః గార్గపత్యాహవనీయౌ త్రయో ఽ గ్నయః " అని అన్నాడు. వేదాలు మూడు అనే విషయాన్ని స్మృతికూడా తెలుపుతున్నది. " ఏత ఏవ త్రయో వేదా ఏత ఏవ త్రయో ఽ గ్నయః" అనేది ఆ వచనం. ఈ వాక్యం మహాభారతంలోకూడా రెండు మూడు చోట్ల కనబడుతున్నది. ఈ విధంగా, ఒకే విషయం, లేదా, ఒకే వాక్యం పలుచోట్ల మహాభారతంలో కనిపిస్తే, ఆ విషయం వ్యాసునకు చాలా అభిమతమైనది అని ఏర్పడుతున్నది కదా. అందుచేత అగ్ని మూడు విధాలుగా ఉన్నది, వేదం కూడా మూడు విధాలుగా ఉన్నది– అనే విషయాన్ని వ్యాసమహర్షి పలుమార్లు తెలియజేశారు.

మరి ఒక సామ్యం ఏమంటే, అగ్ని, వేదం– అనే రెండు కూడా యజ్ఞంకోసమే ఏర్పడ్డాయి అనేది. యజ్ఞయాగాదినిర్వహణకోసమే ఈ రెండు ఉన్నాయి. " వేదా హి యజ్ఞార్థ మభిప్రవృత్తాః" అని వేదాంగమైన జ్యోతిషంలో చెప్పబడింది. వేదాల

ముఖ్యోదేశ్యం యజ్ఞనిర్వహణ అయినట్లే, అగ్నియొక్క ముఖ్యోద్దేశంకూడా యజ్ఞనిర్వహణమే. అందువల్లనే అగ్నికి స్వాహాపతి అని, హవ్యవాహనుడనిఏ పేర్లు ఏర్పడ్డాయి.

ఇక, వేదానికి, అగ్నికి మధ్య ఉండే ఐదవ సామ్యాన్ని గమనిద్దాం. ఈ రెండు కూడా ధార్యాలు. ధార్యమంటే— ఏ క్షణంలోనూ నశించకుండా, ఆరిపోకుండా రక్షించుకోబడేది, ధరించబడేది. వైదికుడైన విప్రుడు గార్హపత్యం అనే అగ్నిని ఆరిపోకుండా ప్రతిక్షణం రక్షించుకోవాలి— అని శాస్త్రం చెబుతున్నది. “నిత్యో ధార్యః, అనుగతో మధ్యః” అని హిరణ్యకేశి శ్రౌతసూత్రం చెబుతున్నది. వివాహం జరిగిన నాటినుండి ఎల్లప్పుడూ ఆ అగ్నిని రక్షించుకొని, ధరించాలి. ఒకవేళ అజాగ్రత్తవల్ల అది ఆరిపోతే, ప్రాయశ్చిత్తం చేసుకోవలసి ఉంటుంది. ఆ విధంగానే, అధ్యయనం చేసిన వేదాన్నికూడా మరిచిపోకుండా, ఎల్లప్పుడూ ధరించాలి. “ఏవం సమస్తపాపాని యాంతి వేదస్య ధారణాత్” — అని అంటూ స్కాందపురాణ వచనంలో వేదంవిషయంలో కూడా, అగ్నివిషయంలో ప్రయోగించిన ధారణశబ్దాన్నే ప్రయోగించడం గమనించదగినది. అధ్యయనం చేసిన వేదాన్ని మర్చిపోతే, అది బ్రహ్మహత్యతో సమానమైన పాపం అవుతుంది.

ఆరవ సామ్యం ఏమంటే— అగ్ని, వేదం— అనే రెండు జ్వలించేవి అనేది. అగ్ని జ్వాలారూపమైనది, అది జ్వలిస్తుంది— అనే విషయం ప్రత్యక్షసిద్ధం. వేదానికికూడా ఆ విధంగానే ఒక విలక్షణమైన జ్వాల ఉన్నది, అదికూడా జ్వలిస్తుంది —అని తిరువాయ్ మొ*ழி* ప్రబంధం “శుడర్ మికు శురుదియుళ్ “ (మిక్కలి వెలిగే వేదంలో) అని అంటూ తెలుపుతున్నది. వేదానికి ఉండే జ్వాల ఏమి? అనే విషయాన్ని — “అబాధితప్రమాణ రూపమాన తేజఃప్రచురమాన” (ఏమాత్రం బాధింపబడకుండా ఉండే ప్రమాణంగా ఉండడం అనే తేజస్సుతో నిండినది అయిన) అనే ఈ తిరువాయ్ మొ*ழி* ప్రయోగాన్ని

వివరిస్తూ తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్ అనే ఆచార్యులు చేసిన వివరణం తెలుపుతున్నది. అందువల్ల ప్రామాణ్యం అనే గొప్ప జ్వాల వేదానికి ఉన్నది.

మరొక సామ్యం "ఈ రెండు భగవంతుని రూపాలే" అనేది. దీనిని ముదలాళ్వార్లు ఏ విధంగా అన్నారంటే, " ముత్తీ మఱైయావాన్" (మూడు అగ్నులుగాను, మూడు వేదాలుగాను ఉన్నవాడు) అనే సూక్తి ద్వారా ఈ సామ్యాన్ని తెలియజేశారు.

ఇంకొక, ఎనిమిదవ సామ్యం ఏమంటే, ఈ రెండు వేదిలో ఉంటాయి– అనేది. వేదం ఎవనిలో ఉంటుందో, అతడు వేది అనబడుతున్నాడు. వేదం ఆ వేదిలో ఉంటుంది కదా. వేది అనే పదానికి యజ్ఞవేదిక –అని కూడా అర్థం ఉన్నందున, యజ్ఞాదులలో యజ్ఞవేదికలోనే అగ్ని జ్వలిస్తుంది కనుక, అగ్నికూడా వేదిలోనే ఉంటుంది. –అని తెలుస్తున్నది

ఈ విధంగా, వేదం అగ్నివంటిది– అనే విషయంలో ఈ రెండిటి మధ్య ఎన్నో సామ్యాలను సప్రమాణంగా గమనించడంవల్ల మనం ఎన్నో విధాలయిన వేదమహిమలను తెలిసికోగలిగాము. స్వస్తి.

# వేదదీపం

"వేదం దీపంవంటిది" అనే ఉపమానాన్ని పురస్కరించుకొని కొన్ని వేదమహిమలను గమనిద్దాం. ఈ ఉపమానాన్ని ఆదిశంకరాచార్యులవారు తిరుమంగై ఆళ్వార్లు, వేదాంత దేశికులు, శ్రీ పరాశర భట్టర్– అనే వీరు వేదాన్ని దీపంతో పోలుస్తూ పలికారు.

ముందుగా, ద్రావిడ వేదసూక్తి అయిన తిరుమంగై మన్నన్ పాశురాన్ని గమనిద్దాం. పెరియ తిరుమొ*ళి* ప్రబంధంలో "మిక్కానై మఱైయాయ్ విరింద విళక్కై" అని ఘటికాచల క్షేత్ర మహిమను పొగిడే సందర్భంగా ఆళ్వారులు అంటారు. ఇందులో, ఆ క్షేత్రంలో ఉండే నరసింహ భగవానుని అళ్వార్లు దీపంగా పలుకుతూ, "మఱైయాయ్ విరింద విళక్కై" అని అన్నారు. "నృసింహ భగవానుడు అనే దీపం వేదమనే దీపంగా విరిశాడు"– అని ఇందులో అంటున్నారు. భగవంతుడు దీపమాత్రంగా ఉన్నంతలో ఆ స్వామికి అంతటి విస్తృతి కలగలేదు, వేదమనే దీపంగా విరిసిన తరువాతనే ఎక్కువగా విస్తృతిని, ప్రశస్తిని ఆ స్వామి పొందాడు– అని అంటున్నారు. ఆ స్వామి వేదమనే దీపంగా అయిన తరువాత ఎక్కువ విస్తృతిని పొందిన దీపంగా అయ్యాడు, లోకం అంతా విస్తరించిన దీపం అయ్యాడు, స్వామిని గూర్చి అందరికీ తెలిసింది – అని అంటున్నారు. ఇది తిరుమంగై మన్నన్ అనుభవం.

ఈ విధంగావేదాన్ని దీపంగా పోలుస్తూ చెప్పినట్లయితే, వేదానికి, దీపానికి మధ్య ఏమేమి సామ్యాలు చెప్పినట్లవుతుంది? అనే విషయాన్ని గమనించినప్పుడు, దీపం మనకు వస్తుదర్శనాన్ని కలిగిస్తుంది. ఇంతకు ముందు తెలియని వస్తువులను కూడా మనం దీపం వల్ల తెలుసుకోవచ్చు. ఆ పనినే వేదం కూడా చేస్తున్నది. "నారాయణనై క్కాట్టియ వేదమ్ కళిప్పు*ற்ற*దు" అని అంటూ అముదనార్ "నారాయణుని తెలియజేసే వేదం భగవద్రామానుజుల అవతారం వల్ల అతిశయాన్ని పొందింది"– అని

అన్నారు. అందుచేత వస్తు దర్శనాన్ని కలిగించడం అనేది వేదానికి, దీపానికి మధ్య ఉండే ఒక సామ్యం. ఆ విధంగానే, ఇంకొక సామ్యం ఏమంటే, దీపానికి జ్వాల ఉండేటట్లే వేదానికి కూడా జ్వాల ఉంటుంది. దీపానికి ప్రకాశించే స్వభావం ఉండేటట్లే, వేదానికి కూడా ప్రకాశించే స్వభావం ఉన్నదని అంటూ " శుడర్ మికు శురుదియుళ్ ఇవై యుండ శురనే " అని నమ్మాళ్వార్లు అన్నారు. "సురోత్తముడైన భగవానుడు పిక్కిలి ప్రకాశం కలిగిన వేదంలో ఉన్నాడు"– అని ఇక్కడ వారు అంటున్నారు. అందుచేత వేదం దీపం వలె ఉన్నది –అనేది, వారి అనుభవం.

దీపం అర్థద్యోతనాన్ని చేస్తుంది. ఇక్కడ అర్థం అంటే– వస్తువు, ద్యోతనం అంటే –ప్రకాశింపజేయడం. లోకంలో ఎన్నో వస్తువులు దీపం వల్ల ప్రకాశింప జేయబడుతున్నాయి. వేదం కూడా, ఆ విధంగానే, అర్థద్యోతనాన్ని చేస్తుంది. ఏ విధంగా అంటే, వేదంలో కొన్ని అపూర్వమైన అర్థాలు ఉన్నాయి కదా, వాటిని వేదం తనలోని శబ్దాల ద్వారా ప్రకాశింప చేస్తున్నది. ఇది మూడవ సామ్యం.

ఈ అర్థద్యోతనం అనే విషయాన్ని గూర్చి శంకరాచార్యులవారు తమ బ్రహ్మసూత్ర భాష్యంలోని శాస్త్రయోనిత్వాధికరణభాష్యంలో " మహతః ఋగ్వేదాదేః" అని ఆరంభించి, " అనేక విద్యాస్థానోపబృంహితస్య ప్రదీపవత్ సర్వార్థద్యోతినః " అని అంటూ "ఋగ్వేదం మొదలైనవాని రూపంలోని వేదం అనేది చాలా పెద్ద దీపం, దానికి దీపం వలె అన్ని విధాలయిన అర్థాలను ప్రకాశింప చేసే స్వభావం ఉన్నది" అని అన్నారు. మనకు ఒక వస్తువు ప్రకాశించలేదు అంటే, అది ప్రకాశించడం కోసం లోకంలో దీపం కావలసి వస్తుంది. ఆ విధంగానే, మనకు లోకంలో ప్రకాశించని ఎన్నో అపూర్వాలైన అర్థాలను వేదం ప్రకాశింప జేస్తున్నది. అందుచేత వేదం ప్రదీపంతో సమానమైనది– అని వారి సూక్తిలోని అర్థం.

## వేదవైభవం-5

దీనికి మించి, వేదాన్ని దీపంతో ఉపమిస్తూ, ఎన్నో చక్కని సామ్యాలను ప్రకాశింప చేసినవారు, శ్రీ పరాశరభట్టర్ అనే ఆచార్యులు. వీరు తాము అనుగ్రహించిన శ్రీరంగ రాజస్తవం ఉత్తర శతకం ఆరంభశ్లోకంలో " హర్తుం తమః సదసతీ చ. వివేక్తు మీశో మానం ప్రదీపమివ కారుణికో దదాతి" అని అన్నారు. "సదసత్తులను వివేకించి తెలుసుకోవడం, కోసం వాటిని విభాగించి, వివేకించి స్పష్టంగా గ్రహించడం కోసం వేదం ఉపయోగపడుతున్నది. అటువంటి, దీపంవంటి వేదాన్ని కరుణాస్వభావుడైన భగవంతుడు మనకు ఇస్తున్నాడు"— అని ఇందులో భట్టర్ అంటున్నారు.

లోకంలో మనం గమనిస్తున్నాము. కరుణ కలిగినవారు కొందరు దీపారోపణం చేస్తారు. ఎందుకు చేస్తారు?. ఇక్కడ, మొదటి ప్రయోజనం "హర్తుం తమః" — చీకటి పోవడం అనేది. చీకటి వ్యాపిస్తే మనకు ఎన్నో అడ్డంకులు, చికాకులు కలుగుతాయి. ఇవి తీరాలంటే, ముందు చీకటి తొలగిపోవాలి. అందుకోసం కరుణ కలిగిన వారు ముందుగా, ఆ చీకటి నశించడం కోసం, దీపాన్ని వెలిగించి మన చేతికి ఇస్తారు. దీపం ఇవ్వడంలో వేరొక కారణం ప్రయోజనం కూడా ఉన్నాయి. అవి ఏమంటే, " సదసతీ చ వివేక్తుమ్" {కంలో, కొన్ని వస్తువులు —ఉండే వస్తువులు, మరి కొన్ని వస్తువులు— లేని వస్తువులు. ఏమి ఉన్నాయి?ఏమి లేవు? అని తెలిసి పోవాలంటే, దీపం కావాలి కదా. లోకంలోని ఘటపటాదుల అస్తిత్వ నాస్తిత్వాల జ్ఞానానికి దీపం కావాలి. ఇక్కడ "సదసతీ" అనే పదానికి "మంచి చెడులు" వేరొక అర్థాన్ని కూడా చెప్పవచ్చు. ఈ మంచి చెడులను తెలిసికోవాలి అన్నా, దీపం కావాలి. ఆ విధంగానే, వేదం వల్ల కూడా ఈ రెండు విధాలయిన ప్రయోజనాలు సమకూడుతాయి. వేదం పక్షంలో, "తమః "అంటే— అజ్ఞానం. అజ్ఞానం తీరడానికి వేదం ఉపయోగపడుతుంది. అజ్ఞానం అనే చీకటి లేకుండా చేయడం కోసం కరుణాళువు అయిన భగవంతుడు వేదమనే దీపాన్ని మన చేతికి ఇస్తున్నాడు. ఇక, " సదసతీ చ వివెక్తుమ్" అనేటప్పుడు, " ఇది కార్యం, ఇది అకార్యం, ఇది మంచి విషయం, ఇది చెడ్డ విషయం — అని తెలుసుకోవడం కోసం దీపం ఆవశ్యకం కనుక, దానికి ఉపయోగపడే వేదాన్ని భగవంతుడు దీపంగా ఇస్తున్నాడు. —అని అర్థం.

## వేదదీపం

వేదమనే ప్రమాణ గ్రంథం మనకు దీపం వలె ఉపయోగపడుతుంది. కారుణికుడు ఇవ్వడం, తమస్సును తొలగించడం, మంచి చెడ్డలను తెలియజేయడం –అని అంటూ ఇక్కడ పరాశర భట్టర్ వేదానికి, దీపానికి మధ్య ఇక్కడ మూడు పోలికలు తెలియజేశారు.

ఈ పోలికలను మరి కొంచెం కొనసాగిస్తూ వేదాంతదేశికులు దయాశతకంలో ఒక అందమైన శ్లోకాన్ని అనుగ్రహించారు. ఆ శ్లోకం ఏమంటే, " అనుగుణదశార్పితేన శ్రీధరకరుణే! సమాహితస్నేహా, సమయప్రజానాం శాస్త్రమయేన స్థిరప్రదీపేన" అనేది ఆ శ్లోకం. దీపం అంటే, దానిలో వత్తి ఉండాలి. దానిలో నెయ్యి ఉండాలి. అప్పుడే ఆ దీపం వెలుగుతుంది. ఇక్కడ చెప్పబడిన వేదమనే దీపంలో ఏది వత్తి" ఏది నేయి? అని గమనించినప్పుడు, ఈ విధంగా ఈ శ్లోకం సమాధానం చెబుతున్నది. లోకంలో ఉండే దీపానికి వత్తి ఉంటుంది. ఆ వత్తి దారానికి అనుగుణంగా ఉంటుంది. ఇది ఇక్కడ "అనుగుణ దశార్పితేనే"అనే పదం ద్వారా చెప్పబడింది. గుణమంటే నూలు దారం. వత్తి దానిని అనుసరించే కదా ఉంటుంది. వేదం విషయంలో చూస్తే, వేదానికి అనుగుణమైన వృత్తిని మనం కలిగి ఉన్నప్పుడే, అది మనకు ఉపయోగపడుతుంది. లేకపోతే అది తన అర్థ తత్వాన్ని ప్రకాశింపజేయదు. ఇక, " సమాహిత స్నేహా" అనే ప్రయోగాన్ని గమనించాలి. దీపంలో నేయి కాని, నూనె కానీ ఉన్నప్పుడే, అది వెలుగుతుంది. ఆ విధంగానే, వేదం విషయంలో భక్తి, ప్రీతి ఉన్నప్పుడే అది ప్రయోజనకరం అవుతుంది. ఆ వేదాన్ని ప్రీతితో అనుసరించినప్పుడే అది ప్రయోజనకరమవుతుంది. లోకంలో దీపం వెలగాలంటే, అందులో స్నేహం ఉండాలి, అంటే, నూనె కానీ, నేయి కానీ ఉండాలి. వేదమనే దీపంలో ఏది నేయి? అంటే, ఇక్కడ, ఒక విధమైన సంబంధం, ప్రీతి, భక్తి అనేది వేదవిషయంలో మనకు ఉండాలి. అప్పుడే, ఆ వేదం మనకు తెలియవలసిన అర్థాలను తెలియజేస్తుంది. తన విషయంలో విశ్వాసం, భక్తి లేనివారికి వేదం తనలో ఉండే అర్థతత్వాన్ని ప్రకాశింపజేయదు.

ఈ విధంగా వేదానికి, దీపానికి మధ్య ఏడెనిమిది పోలికలు సూచింపబడ్డాయి. వేదం దీపంవలె ప్రకాశిస్తున్నది. వేదం దీపంవలె జ్వలిస్తున్నది, దీపం వలె అర్థాలను ప్రకాశింపజేస్తున్నది, తమస్సును పోగొడుతున్నది. మంచి చెడ్డలను వివేకించడంలో ఉపయోగపడుతున్నది. వేదం దీపం వలె కరుణ కలిగినవారిచే ఇవ్వబడుతున్నది, అర్థద్యోతనాన్ని చేస్తున్నది– అని ఈ విధంగా ఉండే పలు పోలికలను మనకు పైన ప్రస్తావించిన సూక్తులు తెలియజేస్తున్నాయి. స్వస్తి.

# వేదమారుతం

(ఉ. వే. శ్రీమాన్. వి. యజ్ఞవరాహాచార్యస్వామివారి ద్రావిడోపన్యాసం ఆధారంగా)

వేదం మారుతంతో సామ్యాన్ని కలిగినది— అనే విషయాన్నిగూర్చి తెలుసుకోవడం ద్వారా కొన్ని వేదమహిమలను గమనిద్దాం. ఈ పోలిక మహాభారతం, శ్రీమద్భాగవతం మొదలైన గ్రంథాలలో ప్రస్తావింపబడింది. ప్రస్తుతం ఈ రెండిటికి మధ్య ఉండే ఆఱు విధాలైన సామ్యాలను, వానివల్ల స్ఫురించే విశేషాలను, తద్ద్వారా భాసించే వేదమహిమలను గమనిద్దాం.

ఈ సామ్యాలలో మొదటి సామ్యం— వేదం, మారుతం అనే రెండు కూడా వాసనను తీసికొని వస్తాయి అనేది. గాలి వీచేటప్పుడు అది సువాసనను తీసుకొని వస్తుంది— అనే విషయం లోకానుభవసిద్ధం. దీనిని వేదంకూడా ప్రస్తావిస్తున్నది. "యథా వృక్షస్య సంపుష్పితస్య దూరాత్ గంధో వాతి" అనే వాక్యంతో వేదం ఈ విషయాన్ని చెబుతున్నది. ఒక వృక్షం పూచినట్లయితే, దాని పూలలోని సువాసనను గాలి దూరంనుండి తీసుకొని వస్తున్నది— అనే అర్థాన్ని ఇచ్చే ఈ వాక్యంతో వేదానికి దృష్టాంతంగా వేదమే పలికింది.

ఈ విధంగా వాయువు చేసే పనిని వేదం కూడా చేస్తున్నదా? అని అంటే, "అవును, చేస్తున్నది" అనేదే ఒక భాగవతశ్లోకం ఇచ్చే సమాధానం. అయితే వేదం ఏ సువాసనను దూరంనుండి మోసుకొని వస్తున్నది? అని అంటే, ఇదిగో సమాధానం. "యే తు త్వదీయచరణాంబుజకోశగంధం జిఘ్రంతి కర్ణవివరైః శ్రుతివాతనీతైః" — అనే ఈ శ్లోకంలో "వేదం అనే మారుతం" అనే పోలిక "శ్రుతివాత" శబ్దంద్వారా చెప్పబడింది. ఆ వేదమారుతం భగవంతుని శ్రీచరణ పద్మాలలో ఉండే పరిమళాన్ని తీసికొని వస్తున్నది— అని ఈ శ్లోకం చెబుతున్నది. దీని తాత్పర్యం ఏమంటే, భగవంతుని శ్రీచరణవైభవాన్ని

వేదం తెలియజేస్తున్నది– అని. భగవంతుని శ్రీచరణంపద్మం పరిమళించే సువాసన వేదం అనబడే వాయుద్వారా మనకు చేరుతున్నది.

ఈ విషయాన్ని మనకు ఈ శ్లోకం ఒక చమత్కారకరమైన రీతిలో తెలుపుతున్నది లోకంలో సువాసనను దేనిని అయినా మనం ముక్కుతో ఆఘ్రాణించి ఆనందిస్తాము. కానీ, వేదం అనే వాయువుద్వారా తీసికొని రాబడిన భగవంతుని శ్రీచరణాలలోని ఈ పరిమళాన్ని మనం ముక్కుతో కాకుండా, చెవులద్వారా ఆనందించాలి– అని ఈ శ్లోకం తెలుపుతున్నది.

తరువాత, వేదానికి, వాయువుకు మధ్య ఉండే ఇంకొక పోలిక ఏమంటే, ఈ రెండు ఆకాశంలో సంచరిస్తూ ఉండడం. వాయువు ఆకాశంలో సంచారం చేస్తుంది– అనే విషయం అందరికీ తెలిసినదే. నభస్ అని ఆకాశానికి, నభస్వాన్ అని వాయువుకు పేర్లు ఇందువల్లనే కలిగాయి. వాయువువలె వేదంకూడా ఆకాశంలో సంచరిస్తూ ఉంటుందా? అని అంటే, "అవును" అని సమాధానం ఇస్తున్నది, మహాభారతంలోని ఒక శ్లోకం. "తేషాం బ్రహ్మమయీ వాణీ సర్వేషాం శ్రోత్రమాగతా, దివ్యా సరస్వతీ తత్ర సంబభూవ నభఃస్థలాత్" అనే ఈ శ్లోకం మహాభారతంలోని సభాపర్వంలో ఉన్నది. దీని అర్థం ఏమంటే– వేదానికికూడా బ్రహ్మమనే నామం ఉన్నది. అందువల్ల వేదం ఇక్కడ "బ్రహ్మమయీ వాణీ దివ్య సరస్వతీ" అని చెప్పబడింది. అది, "నభఃస్థలాత్"– అంటే, ఆకాశంనుండి, మన చెవులకు చేరుతున్నది– అని ఈ శ్లోకం అంటున్నది. శబ్దతరంగాల రూపంలో ఆకాశంలో సంచరించే వేదాన్ని ఆలకించడం, తెలిసికోవడం మనవంటివారికి సాధ్యం కాదు. అయితే, తపఃసిద్ధిని పొందిన మహర్షులు తమ విలక్షణమైన శక్తిద్వారా వేదధ్వనులను సాక్షాత్కరింప చేసికొని, వాటిని మనకు మంత్రాల రూపంలో అనుగ్రహించారు. ఈ విధంగా వాయువలె వేదం కూడా ఆకాశంలో సంచరిస్తుంది.

మూడవ సామ్యం ఏమంటే, వాయువువలె వేదంకూడా మనకు ఔషధాన్ని కొని వస్తుంది—అనేది. పర్వతసానుప్రాంతాలలో వీచే వాయువు, ఆ పర్వతాలపై ఉండే ఔషధాలపైనుండి వీచడం వల్ల, ఆ ఔషధాల సువాసనను తీసుకుని వస్తుంది. ఈ విషయాన్ని వేదంకూడా "ఆవాత వాహి భేషజమ్, వివాత వాహి భేషజమ్" అనే మంత్రాల ద్వారా తెలుపుతున్నది. "ఓ మారుతమా! నీవు ఔషధాన్ని తీసుకొని రా" అని ఈ మంత్రాలద్వారా ప్రార్థించడం జరుగుతున్నది. ఈ విధంగానే వేదంకూడా మనకు ఔషధాన్ని తీసుకొని వస్తుంది. ఏ రీతిలో అంటే, "నిర్వాణం భేషజం భిషక్" అని అంటూ ఔషధంగా కీర్తింపబడే భగవంతుని మన దగ్గరకు వేదం తీసికొని వస్తున్నదికదా అంతేకాక, వేదమే ఔషధం అవుతున్నదికూడా. "త్రయీమఖిలకిల్బిషప్రశమనైకదివ్యౌషధమ్" అని తెలుపుతున్నది, భోజమహారాజు రచించిన చంపూరామాయణ ప్రబంధం. అన్ని విధాలయిన పాపాలను పోగొట్టే అద్వితీయమైన, దివ్యమైన ఔషధం వేదం, సకలపాప నివర్తకం వేదం— అని ఈ సూక్తి తెలుపుతున్నది. ఈ విధంగా వేదం, వాయువు కూడా ఔషధంతో కూడినవై ఉన్నాయి.

నాలుగవ సామ్యం ఏమంటే, వాయువు ద్వారానే మనం శబ్దం వినడానికి వీలవుతుంది. వాయువు లేని చోట ఎంత పెద్ద చప్పుడు చేసినా అది వినపడదు. ఈ విషయాన్ని విజ్ఞానశాస్త్రజ్ఞులు ప్రయోగశాలలో ఋజువు చేస్తున్నారు కూడా. అందువల్ల శబ్దం వ్యాపించడానికి వాయువు ఆవశ్యకమైనది. కనుక, "పరవు ఒలి" ని (వ్యాపించే శబ్దాన్ని) కలిగినది కేవలం వాయువు మాత్రమే కాదు, వేదం కూడా అటువంటిదే. ఇక్కడ " పరవుదల్" (వ్యాపించడం) అనేదానికి చాలా అర్థాలు ఉన్నాయి. పలకడం అని, స్తుతించడం అని కూడా దీనికి అర్థాలు ఉన్నాయి. వాయువు ఒక అర్థంలో" పరవుదల్" (వ్యాపించడం) అనే గుణాన్ని కలిగినది. వేదం ఇంకొక అర్థంలో "పరవుదల్" (భగవంతునిగూర్చి పలకడం, స్తుతించడం) అనే ఈ గుణాన్ని కలిగినది.

విష్ణుపదంలో ఉండడం అనేది ఈ రెండిటి మధ్య ఉండే ఇంకొక సామ్యం. విష్ణుపదం అంటే ఆకాశం. వాయువు విష్ణుపదం అనబడే ఆకాశంలో సంచరిస్తుంది– అనే విషయం ఇంతకుముందే ప్రస్తావించడం జరిగింది. అయితే, ఇక్కడ వేదవిషయంలో, విష్ణుపదం అనే పదానికి విష్ణుయొక్క పాదమని, వైకుంఠమనికూడా అర్థం చెప్పవచ్చు. వేదపక్షంలో ఈ రెండు విధాలైన అర్థాలు సమన్వయిస్తాయి. భగవంతుని శ్రీపాదాలకు అలంకరింపబడిన మంజీరాల ధ్వనియే వేదం– అని అన్నారు పరాశర భట్టర్. "ఆరణంగళ్ ఎల్లామ్ అడి శూడ" (వేదాలు అన్నీ శ్రీచరణాలను అలంకరించగా) అని దేశికులు కూడా అన్నారు. అందుచేత వేదం భగవంతుని శ్రీచరణాలలో నివసిస్తుంది– అని తెలుస్తున్నది.

ఇక చివరి సామ్యం, ఆరవ సామ్యం ఏమంటే, వేదం వాయు రూపంలో ఉన్నది అనేది. మిగిలిన సామ్యాలన్నీ అటు ఉండనివ్వండి. వేదమే వాయువు అనేవారుకూడా ఉన్నారు. దీనికి ఉదాహరణంగా ఒకే వాక్యాన్ని గమనిద్దాం. మహాభారతంలో నారదమహర్షి ఈ విధంగా అంటున్నాడు– " తస్మాత్ బ్రహ్మవిదో వేదాః నాధీయంతే ఽ తివాయతి, వాయో వాయువయం యుక్తం బ్రహ్మ తత్పీడితం భవేత్" అని. పెద్దగా గాలి వీచినపుడు వేదాన్ని అధ్యయనం చేయడం నిలిపివేయాలి వేదమే వాయు రూపమైనది కనుక పెద్ద గాలివల్ల వేదానికి ఉపద్రవం కలుగుతుంది– అని ఈ శ్లోకంలో నారదమహర్షి అంటున్నాడు. అంతేకాక, వేదాలు "యస్య నిఃశ్వసితం వేదాః" అని చెప్పినట్లుగా భగవంతుని నిఃశ్వాసరూపాలే కదా. అందుచేత వాయురూపాలే.

ఇంతవరకు మనం గమనించినదానినిబట్టి వాయువునకు వేదానికి మధ్య ఉండే సామ్యాలద్వారా వేదానికి కల పలు మహిమలను తెలుసుకున్నాము.

1) భగవంతుని శ్రీచరణ పరిమళాన్ని వ్యాపింపజేసే వైభవం,

2) ఆకాశంలో శబ్దతరంగాల రూపంలో సంచరిస్తూ ఋషుల తపఃశక్తి ద్వారా సాక్షాత్కరింపబడే వైభవం,

3) మనకు దివ్యమైన ఔషధాన్ని తీసుకొని వచ్చి ఇచ్చే వైభవం,

4) భగవంతుని స్తోత్రం చేసే వైభవం,

5) భగవంతుని శ్రీచరణాలలోనే నివసించే వైభవం,

6) పెద్ద గాలి వీచినప్పుడు అధ్యయనం చేయబడకపోవడం—అనే నియమాన్ని కలిగిన వైభవం—

అనే ఆఱు విధాలయిన వేదవైభవాలను వాయువును దృష్టాంతంగా గ్రహించడం ద్వారా తెలుసుకోగలిగాము. స్వస్తి.

# వేదదర్పణమ్

"వేదం అద్దంవంటిది"అనే ఉపమానాన్ని ఆధారంగా చేసికొని వేదమహిమలను కొన్నిటిని గమనిద్దాం. ఈ పోలికను శ్రీపరాశర భట్టర్ శ్రీరంగరాజస్తవంలో, వేదాంతదేశికులు దయాశతకంలో ప్రస్తావించారు. ఇంతేకాక, శరణాగతి ధోరణి మొదలైన గ్రంథాలలో కూడా ఈ సామ్యప్రస్తావన కనిపిస్తుంది. ". వేదం అద్దంవంటిది "అని అంటున్నారు కదా! ఇది ఎవరికి అద్దం?" అని అడిగితే, "వేదం భగవంతునకు అద్దం" అనేది సమాధానం. వేదానికి, అద్దానికి మధ్య ఉండే ఆరు విధాలయిన సామ్యాలు, పూర్వులు చేసిన ప్రస్తావనలను గమనించినట్లయితే, మనకు కనిపిస్తాయి.

1) అందులో మొదటిది ఏమంటే, అద్దం అనేది ఒక వ్యక్తి తనకు ముఖానికి ఎదురుగా పెట్టుకొనే వస్తువు. భగవంతుడు కూడా వేదం అనే అద్దాన్ని తనకు ఎదురుగా నిలుపుకుంటున్నాడు. ఆ విధంగానే భగవంతుడుకూడా వేదాన్ని తనకు ఎదురుగా అద్దం వలె పెట్టుకుంటున్నాడా? అని అంటే, దేశికులు అనుగ్రహించిన గరుడపంచాశత్ స్తోత్రంలోని ఒక శ్లోకాన్ని గమనించండి. " అగ్రే తిష్ఠన్నదగ్రో మణిముకుర ఇవానన్యదృష్టేః మురారేః" అనేదే ఆ శ్లోకం. భగవంతుడు తనకు ముందు ఒక మణిమయమైన అద్దాన్ని నిలుపుకుంటాడట. మరి, ఆ అర్థం ఏది? అంటే, వేదం గరుడుని రూపాన్ని ధరించి, భగవంతుని ముందు అందంగా ఉన్నదట. శ్రీయామునులు కూడా కాంతాచతుఃశ్లోకిలో " వేదాత్మా విహగేశ్వరః" అని అంటూ "వేదంరూపుడే గరుడుడు" అని అన్నారు. అందుచేత గరుడుని రూపాన్ని పొందిన వేదం భగవంతుని ముందు మంగళకరమైన అద్దంగా ఉన్నదట. భగవంతుని దివ్యాలయాలు అన్నిటిలోనూ గరుడుని సన్నిధి భగవంతునకు ఎదురుగా ఉండడం, గరుడుని మూర్తి చేతులను జోడించి, భగవంతుని సేవించే సన్నివేశంలో గోచరించడం కూడా ఇక్కడ మనం గమనించాలి. ఈ విధంగా, అద్దం ఏ విధంగా ఒక వ్యక్తి ముందు నిలుపబడుతున్నదో, ఆ విధంగానే, వేదం కూడా గరుడుని రూపాన్ని పొంది, భగవంతుని ముందు నిలచి, ఆ స్వామిని సేవిస్తున్నది – అని తెలుస్తున్నది కదా.

ఇంకొక విశేషాన్ని కూడా ఇక్కడ గమనించవచ్చు. వేదం "అగ్రే తిష్ఠన్" –"ముందు ఉన్నది" అని చెప్పబడింది కదా. "ముందు ఉన్నది" అంటే, చిరకాలంగా, అంటే, ప్రలయకాలం మందునుండి వేదం ఉన్నది" అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. ఈ విధంగా, ప్రదేశాన్నిబట్టే కాకుండా, కాలాన్నిబట్టి కూడా "అగ్రే" అనే పదాన్ని అన్వయించి, అర్థాన్ని చెప్పవచ్చు. అందుచేత, "వేదం భగవంతునకు ముందు ఉన్నది"– అని, " భగవంతుని వేదం ముందు ఉన్నది" అని ఈ విధంగా రెండు విధాలుగా ఇక్కడ అర్థాన్ని చెప్పవచ్చు. ఇది అద్దానికి, వేదానికి మధ్య ఉండే ఒక విధమైన సామ్యం.

ఇంకొక ఉపమానాన్ని పరాశర భట్టర్ అనుగ్రహించిన శ్రీరంగరాజస్తవం పూర్వశతకంలోని. ఇందులో "మణిముకురమివాగ్రే మంగళం రంగధామ్నః, శరణ మభిగతాః స్మో యత్ర రూపస్వరూప స్వగుణమహిమదర్శీ మోదతే రంగశాయీ". అనే సూక్తిలో గమనించవచ్చు అద్దం, తనకు ముందు ఉండే వస్తువుయొక్క రూపాన్ని ప్రకాశింపజేస్తుంది. అయితే, ఇక్కడ ఉండే వేదం అనే అద్దం సామాన్యమైన అద్దం కాదు, విలక్షణమైన, విచిత్రమైన అద్దం. ఈ వేదం అనే అద్దం తనకు ఎదురుగా ఉండే భగవంతుని యొక్క రూపాన్ని మాత్రమే కాక, స్వరూపాన్ని, గుణాలను, లీలలను, విభూతులను అన్నిటిని ప్రకాశింప చేస్తున్నది. ఇది చాలా ఆశ్చర్యకరమైన అద్దం కదా– అని అంటున్నారు, ఇక్కడ భట్టర్. దీనివల్ల ఏర్పడే తాత్పర్యం ఏమంటే– వేదం భగవత్స్వరూపరూప గుణవిభూతి లీలాది ప్రకాశకం –అని.

తరువాత, ఇంకోః సామ్యాన్ని దేశికులు దయాశతకంలో తెలియజేస్తున్నారు. భగవంతుడు వేదం అనే అద్దాన్ని తన దయ అనే పత్నికి చూపిస్తున్నాడట. " పద్మాకాంతః ప్రణయతి దయే! దర్పణం తే స్వశాస్త్రమ్" అనే సూక్తిలో ఈ విషయాన్ని గమనించవచ్చు. ఇక్కడ శాస్త్రం అంటే– వేదం అని చెప్పవచ్చు, లేక, భగవంతుడు

సాక్షాత్తు తానే అనుగ్రహించిన పాంచరాత్రాదిశాస్త్రాలు అని కూడా చెప్పవచ్చు. ఇటువంటి అద్దాన్ని భగవంతుడు దయాదేవికి చూపిస్తున్నాడట అందులో దయాదేవి రూపం ప్రతిఫలిస్తున్నదట. దీని తాత్పర్యం ఏమంటే, భగవానుని దయ అనే గుణం ఈ శాస్త్రాలలో స్పష్టంగా ప్రకాశిస్తున్నది– అని.

ఈ రెండిటికి మధ్య ఇక్కడ గోచరించే మరి ఒక సామ్యం ఏమంటే, మంగళత్వం. అంటే, అద్దం అనే వస్తువు మంగళకరమైన ద్రవ్యాలలో ఒకటి అయినట్లుగానే, వేదం కూడా మంగళకరమైనది– అని అర్థం. అద్దం మంగళకరమైన వస్తువు – అనే విషయం సుప్రసిద్ధమైనది. గోదాదేవి తాను చేసే మంగళకరమైన తిరుప్పావై వ్రతంకోసం శ్రీకృష్ణ భగవానుని దగ్గర ప్రార్థించే వస్తువులలో అంద్దం కూడా ఒకటి. అభిధాన చింతామణి అనే నిఘంటువులో వేదం మంగళకరమైన వస్తువులలో ఒకటిగా పరిగణింపబడింది. "మంగళమ్ శేర్ మఱై వేళ్వి యదనుళ్ పుక్కు " అని తిరుమంగై మన్నన్ పెరియ తిరుమొழி ప్రబంధంలో వేదాన్ని మంగళకరమైన వస్తువు– అని తెలియజేశారు. ఈ విషయాన్ని భట్టర్ పై శ్లోకంలో "మంగళం రంగధామ్నః" అని అంటూ తెలియజేశారు. ఈ విధంగా వేదం, అద్దం– అనే రెండు మంగళకరమైన వస్తువులు– అనేది మూడవ పోలిక.

నాల్గవ పోలిక ఏమంటే, ఈ రెండు అమలమైనవై, స్వచ్ఛమైనవై ఉంటేనే కార్యకరం అవుతాయి– అని అనేది. వేదం కూడా అర్థంవలె స్వచ్ఛమైనది. ఈ విషయాన్ని పాట్టరాచార్యులవారు తమ కావ్యంలో "ఆగమౌఘచ్ఛద్మామలాఘముకుర ప్రతిబింబితాత్మా" అని ఈ ఆగమ సమూహాలు స్వచ్ఛమైన అద్దంవంటివి– అని, అందులో భగవంతుని స్వరూపం ప్రతిబింబిస్తున్నదని అన్నారు. అందుచేత వేదం అమలమైనది, పవిత్రమైనది. దోషం లేనిది. లోకంలో ఉండే మిగిలిన అన్ని గ్రంథాలలోవలె, వేదంలో భ్రాంతి మొదలైన కారణాల వల్ల ఏర్పడే దోషాలు సంభవించే అవకాశం లేదు. అందుచేత, చెప్పబడిన విషయం అసత్యమై ఉంటుందా? దోషాన్ని

కలిగినదై ఉంటుందా? మోసం చేయడం కోసం చెప్పినదై ఉంటుందా? అని పౌరుషేయ గ్రంథాలలో సంభావితాలైన దోషాలు ఏవీ వేదంలో ఉండవు. వేదం అపౌరుషేయం కదా. ఎవరిచేత రచింపబడిన గ్రంథం కాదు. అందుచేత వేదం విశుద్ధమైనది, అమలమైనది. "విశుద్ధానాం వాచాం వృషశిఖరినాథః స్తుతి పదమ్" అనే దయా శతకంలో కనిపించే ప్రయోగంలో "విశుద్ధానాం వాచామ్" అనే ప్రయోగం వేదాన్ని నిర్దేశిస్తుంది.

ఇక, ఇంకొక సామ్యం ఏమంటే, వేదం అద్దంవలె భగవంతుని ఆరాధనోపకరణం అనేది. ప్రతిదినం మనం భగవంతుని సమర్పించే ఆరాధనలో ఉపయోగపడే పరికరాలలో అద్దం ఒకటి అనేది ప్రసిద్ధమైన విషయం. స్వామికి అలంకారాసన సమర్పణలో ఆదర్శఛత్ర చామరనృత్తగీతవాద్యాదులను సమర్పించచడం, వేదసూక్తాలను అనుసంధిస్తూ పూలను సమర్పించడం చేస్తాము కదా. ఇది అయిదవ సామ్యం.

ఆరవ, చివరి పోలిక ఏమంటే, అద్దంవలె వేదం కూడా అభిముఖ్యం కలిగినవారికే ఉపయోగపడుతుంది. అద్దానికి ఎదురుగా ఉన్నప్పుడే అందులో వస్తుప్రతిబింబం కనిపిస్తుంది. ఆ అద్దం వల్ల ఉపయోగం ఉంటుంది. ఆ విధంగానే, వేదం విషయంలో ఆభిముఖ్యం, అంటే, అనుకూల భావం ఉన్నప్పుడే, అది తనలో ఉండే అర్థాన్ని మనకు ప్రకాశింపజేస్తుంది. విముఖులమై ఉంటే ఏ ఉపయోగం లేదు. దేశికులు ఈ విషయాన్ని "ఆభిముఖ్యదశామాత్రాత్" అని సుభాషితనీవి అనే గ్రంథంలో సూచించారు.

ఈ విధంగా, వేదానికి, అద్దానికి మధ్య ఉండే ఆరు విధాలైన పోలికలను అనుసరించి వేదమహిమలను గమనించాము. స్వస్తి.

# వేదగోపురం

"వేదం గోపురంవంటిది" అనే ఔపమ్యాన్ని పురస్కరించుకొని వేదమహిమలను కొన్నిటిని తెలిసికుందాం.

పెద్ద పెద్ద నగరాలకు, పెద్ద పెద్ద ఆలయాలకు ఒక్కొక్క దిక్కులో ఒక్కొక్క గోపురం ప్రకారం నాలుగు గోపురాలు నిర్మింపబడి ఉంటాయి. వేదానికికూడా ఈ నాలుగు అనే సంఖ్యలో సామ్యం ఉన్నది. వేదాలు నాలుగు. ఈ నాలుగు వేదాలు ఒక్కొక్క దిశలో ఒక్కొక్కటి ఉన్నాయి– అని వేదమే తెలియజేస్తున్నది. "ఋచాం ప్రాచీ మహతీ దిగుచ్యతే, దక్షిణా మాహుర్యజుషా మపారా మథర్వణా మంగిరసాం ప్రతీచీ సామ్నా ముదీచీ మహతీ దిగుచ్యతే" అనేది కాఠకశ్రుతి. చతుర్ముఖ బ్రహ్మకూడా ఒక్కొక్క దిశలో ఒక్కొక్క ముఖాన్ని కలిగినవాడై, ఆ నాలుగు ముఖాలతో నాలుగు వేదాలను అనుసంధిస్తాడు. తూర్పు దిక్కుగా ఋగ్వేదాన్ని, దక్షిణ దిక్కులో యజుర్వేదాన్ని, పడమటి దిక్కులో అథర్వణవేదాన్ని ఉత్తర దిక్కులో సామవేదాన్ని అనుసంధిస్తాడు. ఈ విధంగా వేదాలు నాలుగు, గోపుర ద్వారాలు కూడా నాలుగు అనే సామ్యం మొదటిది.

రెండవది ఔన్నత్యంలో సామ్యం. గోపురం, వేదం అనే రెండు కూడా చాలా ఉన్నతంగా ఉంటాయి. "ఊழிతொழు ఊழி తొழுమ్ ఉయర్ న్ద శెల్వత్తు ఓంగియ నాన్మఱై అనైత్తుమ్ కాక్కుమ్ నావర్" అనే పెరియ తిరుమొழி పాశురంలోని "ఓంగియ నాన్మఱై" అనే ప్రయోగానికి ఇదే అర్థం. ఈ విధంగా గోపురం ఉన్నతమైనది, వేదం కూడా ఉన్నతమైనది. గోపురం ఆకారంలో ఉన్నతమైనది. వేదం స్వభావంలో, మహిమలో ఉన్నతమైనది.

మూడవ సామ్యం ఏమంటే, అవి ఉండే చోటులోని సామ్యం. . వేదం, గోపురం అనే రెండు భగవంతుని పాదంలో ఉంటాయి. . ఇక్కడ పదశబ్దానికి పాదమని, స్థానమని అర్థాలు. గోపురం భగవంతుని స్థానంలో, అంటే, భగవంతుని దివ్యదేశంలో ఉంటుంది. ఇక, వేదం, భగవంతుని శ్రీ చరణంలో నిలచి ఉంటుంది. "పరవు మఱైకళెల్లామ్ పదమ్ శేర్ న్దొన్డు నిన్ఱ పిరాన్" అనేది దేశికప్రబంధ సూక్తి. ప్రకారం భగవంతుని పాదంలో వేదం

నిలచి ఉంటుంది. వేదం భగవంతుని పాదాలలో నిలచి ఉండే విషయాన్ని పాదుకా సహస్రం పదేపదే తెలియజేస్తున్నదికూడా.

నాలుగవ సామ్యం ఏమంటే, వేదం, గోపురం అనే ఈ రెండు త్రివిక్రమసంబంధాన్ని కలిగి ఉండడం. త్రివిక్రముని శ్రీచరణం ఏవిధంగా ఉన్నతమై ఉన్నదో, ఆ విధంగానే గోపురం, వేదం అనే ఈ రెండు ఉన్నతమై ఉన్నాయి త్రివిక్రముని పాదం ఉన్నతంగా వ్యాపించి, ఔన్నత్యాన్ని పొందినట్లు, వేదం కూడా ఔన్నత్యాన్ని కలిగి ఉన్నది. వివరంగా చెప్పవలసి వస్తే, వేదం త్రివిక్రముని పాదాలలో ఉన్నందున, త్రివిక్రముని పాదం ఉన్నతంగా వ్యాపించి, ఔన్నత్యాన్ని పొందినప్పుడు, ఆ పాదంలో ఉండే వేదం కూడా ఔన్నత్యాన్ని పొందింది. స్వామి పాదం పైకి వెళ్ళే కొద్దీ వేదంకూడా మరింత, మరింత ఔన్నత్యాన్ని పొందింది. "త్రిరిత్యేవం త్రయో వేదాః కీర్తితా మునిసత్తమైః, క్రమసే తాన్ తథా సర్వాన్ త్రివిక్రమ ఇతి స్మృతః" అనే ఒక శ్లోకాన్ని భట్టర్ సహస్రనామభాష్యంలో త్రివిక్రమనామానికి భాష్యాన్ని అనుగ్రహిస్తూ ఉదాహరించారు. మూడు వేదాలలోనూ భగవంతుడు పాదన్యాసాన్ని చేసినందున అతనికి త్రివిక్రముడనే పేరు వచ్చిందట. అందుచేత, గోపురం అనేది త్రివిక్రముని శ్రీచరణన్యాసాన్ని కలిగి ఉన్నట్టే, వేదంకూడా త్రివిక్రముని పాదన్యాసాన్ని కలిగి ఉన్నది.

ఈ నాలుగు విధాలైన సామ్యాలను కొనసాగిస్తూ కంబ మహాకవి తన కంబరామాయణ కావ్యంలో అయోధ్యానగరాన్ని వర్ణిస్తూ, మరి నాలుగు సామ్యాలనుకూడా తెలియజేశారు. కంబుడు మహాకవి అయినందున, ఈ నాలుగు సామ్యాలను చాలా యుక్తంగా, అద్భుతంగా చెప్పారు.

"మాఋఊా వఴుక్కినాలుమ్, ఆఋకళ్ ఉఱైప్పదాలుమ్, వాయిలా ఇరుప్పదాలుమ్, మన్నుదల్ పణ్ణలాలుమ్ " అనేది ఆ సూక్తి.

ఇందులో మొదటిది"మాఋఊా వఴుక్కినాలుమ్" అనేది. అయోధ్యానగరగోపురంలోకి ఎవరు ప్రవేశించినప్పటికీ, వారి స్వభావాల్లో ఉండే ఋజుత్వం ఏమీ మారదు. అయోధ్యా నగరం పుణ్యక్షేత్రం కనుక, అక్కడ ఉండే గోపురంలోకి పోయినవారికి అందరికీ మంచి బుద్ధి కలుగుతుంది. తమ మంచి

స్వభావంలో ఏ విధమైన మార్పు కలుగదు. న్యాయమైన, ధర్మమైన రీతిలోనే అక్కడ అన్ని వ్యవస్థలు ఉంటాయి.

ఈ విధంగానే వేదంలో కూడా ధర్మవ్యవస్థకు ఏ విధమైన మార్పు ఉండదు. "వేదోఖిలో ధర్మమూలం" కదా. వేదంలోని రూపక్రమానికి కూడా ఏ విధమైన మార్పు ఉండదు. అందులో ఉండే ఏ పదానికి కానీ, అక్షరానికి కానీ, స్వరానికి కానీ, ఏ విధమైన మార్పు లేకుండా, కలుగకుండా వేద పండితులు వేదాన్ని అనుసంధిస్తారు. అందుచేత, వేదంకూడా ఏ విధమైన మార్పు లేని స్వభావాన్ని కలిగినది. కొన్ని కోట్ల సంవత్సరాలుగా కొనసాగుతూ వచ్చే ఈ వేదంలో ఏ విధమైన మార్పు లేనందున, "మాఱుఱా వ౹ళక్కు" అనేది వేదానికి ఉన్నది అనేది సిద్ధం.

తరువాత చెప్పబడిన సామ్యం "ఆఱుకళ్ ఉరైప్పదాలుమ్" అనేది. "ఆఱు" అంటే —దారి, మార్గం. . మనం గమ్యాన్ని చేరాలంటే, ఏ మార్గంలో వెళ్ళాలో గోపురం తెలియజేస్తుంది. ఆ విధంగా మనం వెళ్లవలసిన మార్గాన్ని సూచించే సూచికలు గోపురాల దగ్గర నిలుపబడి ఉంటాయి.

వేదం కూడా మనకు పలు విధాలైన మార్గాలను తెలియజేస్తుంది. ప్రవృత్తి మార్గం, నివృత్తి మార్గం, సిద్ధోపాయం, సాధ్యోపాయం మొదలైన ఎన్నో మంచి మార్గాలను వేదం మనకు బోధిస్తున్నది. ఈ విధంగా వేదానికి, గోపురానికి మధ్య మరొక సామ్యం ఉన్నది.

తరువాత చెప్పబడిన సామ్యం "వాయిలా ఇరుప్పదాలుమ్" అనేది. ఇది వాక్చమకృతి తో కూడిన సామ్యం. వేదం, గోపురం రెండు "వాయిల్" అని అంటున్నారు, కంబమహాకవి. గోపురం "వాయిల్ "అని అనబడడం ఏ విధంగా? అంటే, " తోరణ వాయిల్ కాప్పానే" అని గోదాదేవి చెప్పినట్లుగా శ్రీకృష్ణమందిరంలో గోపుర వాకిలి ఉన్నది. గోపురవాకిలికి "వాయిల్" అని తమిళంలో పేరు. "వాశల్" అనే పదమే "వాయిల్" అని మారింది.

వేదాన్ని కూడా "వాయిల్" అని అనడం ఏ విధంగా? అంటే, అది వాయ్" అనబడే గొంతు స్వరం ద్వారా వ్యక్తమవుతున్నది తప్ప వ్రాయబడడం లేదు. అందుచేత గోపురం "వాయిల్", వేదం కూడా "వాయిల్. " (వాయ్+ఇల్)

ఇక, చివరి సామ్యం ఏమంటే, "వేద మన్న వాయిల్" అనేది. " "వేదమ్ అన్న" అంటే– వేదంవలె– అని అర్థం. వేదంవంటి "వాయిల్" గోపురంలో ఉన్నది. అది ఇంతకు ముందే చెప్పబడింది. ఇక్కడ " వేదమ్ అన్న" అనే పదవిభాగాన్ని గోపురపక్షంలో చేయాలి. " వేదమ్ అన్న "అని విడదీయకుండా, " వేద మన్న వాయిల్ "అని వేదం విషయంలో పద విభాగం చేసి, "వాయిల్ మన్న "అని అర్థాన్ని గ్రహించవచ్చు. అప్పుడు. " వాయిల్–గొంతులో, మన్న– స్థిరంగా ఉండే వేదం. " అని అర్థం. వేదానుసంధానం చేసే వేదపండితుని గొంతులోకదా వేదం స్థిరంగా నిలచి ఉంటుంది.

ఈ విధంగా కంబమహాకవి మరి నాలుగు సామ్యాలను వేదానికి, గోపురానికి మధ్య సాధించారు.

ఇంతవరకు మనం ఏ ఏ వేదమహిమలను గమనించాము? అంటే, నాలుగా విభాగింపబడిన గొప్పతనం, ఉన్నతంగా ఉండే గొప్పతనం, భగవంతుని శ్రీచరణాలలో నిలచి ఉండే గొప్పతనం, త్రివిక్రముని స్వరూపాన్ని స్మరింపజేసే గొప్పతనం, స్వభావంలో ఏ విధంగాను మార్పు లేని గొప్పతనం, మంచి మార్గాన్ని తెలియజేసే గొప్పతనం, గొంతు ద్వారా వ్యక్తమయే గొప్పతనం, గొంతులో స్థిరంగా ఉండే గొప్పతనం–అనే ఎనిమిదివిధాలైన మహిమలను గమనించాము. స్వస్తి.

# వేదసౌధం

"వేదం, పలు అంతస్తులను కలిగిన సౌధంవంటిది" అనే ఉపమానాన్ని దృష్టిలో పెట్టుకొని కొన్ని వేదమహిమలను గమనిద్దాం.

ముందుగా, వేదాంతదేశికుల దయాశతకంలోని ఒక శ్లోకాన్ని చూద్దాం. " నిరాకృతవతీ దయే! నిగమసౌధదీపశ్రియా విపశ్చిదవిగీతయా జగతి గీతయాంధం తమః" అనేది ఆ శ్లోకం. ఈ శ్లోకంలో– " వేదం అనేది పలు అంతస్తులను కలిగిన ఒక సౌధం. , అందులో వెలిగింపబడి, ప్రకాశించే దీపంవలె భగవద్గీత ఉన్నది. దయాదేవి భగవంతుని శ్రీకృష్ణునిగా అవతరింపచేసి, ఆ స్వామిచే గీత అనే దీపాన్ని వెలిగింపజేసి, లోకంలో ఉండే చీకటిని అంతటివి పోయేటట్లు చేసింది– అని చెప్పబడింది. ఈ శ్లోకంలో వేదం ఒక ఉన్నతమైన సౌధంగా ఉపమింపబడిందికదా.

ఈ విధంగా వేదానికి, సౌధానికి మధ్య ఎటువంటి పోలికలు ఉన్నాయి?అని ఈ స్తోత్ర వ్యాఖ్యాతలు గమనించి చూశారు. వారు తమ వ్యాఖ్యానాలలో వేదానికి, సౌధానికి మధ్య ఉండే ఎన్నో పోలికలను తెలియజేశారు. వాటిలో, మొదటి పోలిక ఏమంటే, సౌధం, హర్మ్యం, ప్రాసాదం –అని అంటూ పలు పేర్లతో పిలువబడే, పలు అంతస్తుల కలిగిన కట్టడంలో, మొదటి అంతస్తు, రెండవ అంతస్తు, మూడవ అంతస్తు –అని ఈ విధంగా చాలా అంతస్తులు ఉన్నట్లే, వేదంలో కూడా సంహితాభాగం, ఆరణ్యక భాగం, బ్రాహ్మణ భాగం, ఉపనిషద్భాగం –అని పలు విభాగాలు ఉన్నాయి. సంహితాభాగంలో కూడా, సంహితా పాఠం, క్రమపాఠం, పదపాఠం, జటాపాఠం, ఘనపాఠం –అని పలు విభాగాలు పలు అంతస్తులుగా ఉన్నాయి. రెండవ పోలిక ఏమంటే, ప్రాసాదం చాలా అంతస్తులను కలిగినది కనుక, చాలా ఎత్తైనదిగా ఉంటుంది. వేదం కూడా భగవంతుని సంబంధాన్ని కలిగి ఉన్నందున, చాలా ఉన్నతమైనది. మూడవ సామ్యం ఏమంటే–ఈ రెండిటిని కూడా క్రమక్రమంగా మెట్టు మెట్టుగా అధిరోహించాలి– అనేది. సౌధాన్ని లో అధిరోహించడానికి మెట్లు చాలా ఉంటాయి. సౌధంలో ఉండే పై అంతస్తులలోకి వెళ్లాలంటే, ఒక్కొక్క మెట్టును ఎక్కి పైకి వెళ్ళాలి. ఆ విధంగానే, , వేదంలో కూడా మనం పైపైకి వెళ్లాలంటే, క్రమక్రమంగానే నా కార్యం సాధ్యం అవుతుంది. కొంచెం కొంచెంగా, క్రమక్రమంగా

వేదాన్ని అధ్యయనం చేస్తూ, అందులో ఉన్నత పదవిని పొందాలి. వేదం విషయంలో నిరంతరాభ్యాసం మూలంగా, విద్య మూలంగా అటువంటి ఉన్నతమైన దశను పొందడం అనేది వేదంలో ఉండే ఒక విశేషం. బోధాయనుమహర్షి ఈ విధంగా అంటున్నాడు. " వేదానాం కించిదధీత్య బ్రాహ్మణః, ఏకాం శాఖామ్ అధీత్య శ్రోత్రియః, అంగాధ్యాయ్యనూచానః, కల్పధ్యాయీ ఋషిః, కల్పసూత్ర ప్రవచనాధ్యాయీ బ్రూణః" ( వేదవిద్యలో ఆరంభంలో ఉండేవానికి బ్రాహ్మణుడని పేరు. ఒక శాఖను మాత్రం పూర్తిగా అధ్యయనం చేసినవానికి శ్రోత్రియుడని పేరు. దానికి మించి, వేదాంగాలైన వ్యాకరణం మొదలైనవానిని అధ్యయనం చేసినవానికి అనూచానుడు అని పేరు. అంతకుమించి, శ్రౌతకర్మలలో ఆవశ్యకమైన విద్యను పొందినవాడు ఋషి. . అంతకుమించి, ఆ వేదం విధించిన యజ్ఞాలలో చేయవలసిన విధానాలను వివరించే కల్పసూత్రాలను అధ్యయనం చేసి, ఇతరులకు నేర్పించగలిగినవాడు బ్రూణుడు అనబడతాడు). ఈ విధంగా సౌధంలో పలు మెట్లు ఉన్నట్లే, వేదవిద్యలో కూడా పలు దశలు ఉన్నాయి.

"మెట్టు మెట్టుగా" అనేది ఇంకో అర్థంలో కూడా సరిపోతుంది నారదీయ శిక్షలో "యోజనానాం శతం సాగ్రం శనైర్యాతి పిపీలికా" ( చీమ కూడా కొద్దికొద్దిగా ప్రయాణం చేస్తూ, వందలాది యోజనాల దూరాన్ని ఎంత ఎత్తుకయినా కూడా వెళ్ళగలదు) అని తెలుపుతున్నది. ఆ విధంగానే, వేదాధ్యయనం చేసేవాడు కూడా కొంచెం కొంచెంగా అధ్యయనం చేస్తూ, వేదంలో అగ్రభాగాన్ని చేరగలడు. వైదికుడు పొందే ఔన్నత్యం అతని విద్య కారణంగా లభిస్తున్నది కావున, అతడు అభ్యసించే విద్యకు వేదం మూలమైనది, ఆ తరువాతనే అతడు మిగిలిన తర్కాది శాస్త్రాలను అభ్యసిస్తున్నాడు. కనుక, వేదంలో కానీ, సౌధంలో కానీ, క్రమక్రమంగా ఉన్నతమైన స్థానాన్ని పొందడం అనేది చాలా పొసగుతుంది.

మరొక సామ్యం ఏమంటే, సౌధంలో లోపలి భాగాలలో అందంకోసం, ప్రకాశం కోసం దీపాలను వెలిగిస్తారు. సౌధాల లోపల దీపాలు ఆవశ్యకం అయినట్లే, వేదం అనే సౌధానికి కూడా ఒక దీపం ఆవశ్యకమై ఉన్నది. వేదమనే సౌధాన్ని ప్రకాశింప చేసే ఆ దీపం ఏమంటే– భగవద్గీతయే. దానిని శ్రీకృష్ణుడు వెలిగించాడు. భగవద్గీత అనే ఈ దీపం

ద్వారా వేదసౌధంలో ఉండే అర్థాలన్నీ ప్రకాశిస్తాయి. అందులో మనకు ఏర్పడే అజ్ఞానం అనే చీకటిఅంతా తీరిపోతుంది.

ఇంతకుముందు ప్రస్తావించిన దయాశతకంలో ఉండే "దీపశ్రియా" అనే ప్రయోగం ద్వారా ఇక్కడ ఇంకొక సామ్యం కూడా వ్యక్తం అవుతున్నది. దీపాలవల్ల సౌధానికి అంతకు ముందు లేని ఒక విలక్షణమైన అందం కలిగేటట్లే, భగవద్గీత అనే దీపం వల్ల వేదానికి ఒక అపూర్వమైన అందం ఏర్పడుతున్నది– అనేదే సామ్యం.

ఈ విధమైన సామ్యాల ద్వారా మనకు తెలియవచ్చే వేదమహిమలు ఏమంటే–

వేదం పలు అంతస్తులను కలిగినది,

వేదం చాలా ఉన్నతమైనది,

వేదం ఒక దీపాన్ని అపేక్షిస్తున్నది,

వేదం క్రమక్రమంగా అధిరోహించడానికి వీలైనది,

వేదం తనకు ఉపబృంహణం అయిన భగవద్గీత ద్వారా అజ్ఞానాన్ని పోగొడుతున్నది– అనే ఎన్నో వేదమహిమలు తెలుస్తున్నాయి.

మరొక పోలికకోసం వేదాంతదేశికులు అనుగ్రహించిన ఇంకొక సూక్తిని గమనిద్దాం. ఇది న్యాయపరిశుద్ధి అనే గ్రంథంలో ఉన్నది. యస్యాజ్ఞా నిగమైక హర్మ్యవలభీవాస్తవ్యపారావతీ" అనేది ఆ సూక్తి. బాగా ఎత్తుగా ఉండే హర్మ్యాలలో, పై అంతస్తులలో పావురాలు నివాసం ఉండడం కోసం కొన్ని గదులవంటి నిర్మాణాలను చేస్తారు. ఆ గదులలో పావురాలు నివాసం ఉంటూ, మధురంగా ధ్వనులను చేస్తాయి. ఆ విధంగానే, వేదంలోని అగ్రభాగాలైన ఉపనిషత్తులలోని ఏ ఏ భాగాలలో ఏ ఏ పక్షుల ధ్వనులను వినిపిన్నాయి? అని అంటే, భగవంతుని ఆజ్ఞలు అనే పావురాల శబ్దాలు మనకు ఉపనిషత్తులలో వినిపిస్తాయి– అని తెలుపుతున్నది, ఈ శ్లోకం. అంటే, వేదాన్ని పలు అంతస్తులను కలిగిన సౌధంతో పోల్చినప్పుడు, వేదం అనే సౌధం పై అంతస్తులలో నివసించే పావురాలు చేసే ధ్వనులుగా భగవంతుని ఆజ్ఞలు వినిపిస్తున్నాయి అవి ఏవి

అంటే, " సత్యం వద, ధర్మం చర" అని మొదలైన ఆజ్ఞలు, " మాతృదేవో భవ పితృదేవో భవ" అజ్ఞలే ఆ పావురాల ధ్వనులు.

వేదానికి, సౌధానికి మధ్య ఉండే పోలికను వేదాంతదేశికులే అనుగ్రహించిన నిక్షేపరక్ష అనే గ్రంథంలో ఉండే ఒక సూక్తి తెలుపుతున్నది. అది ఏమంటే– ° నిష్ప్రత్యూహ షడంగయోగ నిగమ ప్రాసాదనిఃశ్రేణికాం నిత్యం చేతసి ధారయంతు సుధియో నిక్షేపరక్షా మిమామ్" అనేది ఆ సూక్తి. ఈ శ్లోకంలో కూడా దేశికులు వేదాన్ని సౌధంగా పోలుస్తున్నారు. ఆ వేదం అనే సౌధం అగ్రభాగంలో శరణాగతి అనే తత్వం ఉన్నది. దానిని అధిరోహించడానికి నిచ్చెన వలె ఉన్నది– ఈ నిక్షేపరక్ష అనే గ్రంథం – అని వారు అంటున్నారు. ఇక్కడ "నిత్యం చేతసి ధారయంతు సుధియః" అని అంటూ, "బుద్ధిమంతులు వేదాన్ని మనసులో ధరించినట్లుగానే, ఆ, వేదంతో సంబంధం కలిగినందున వేదమనే సౌధాన్ని అధిరోహించడానికి నిచ్చెనగా ఈ నిక్షేపరక్ష అనే గ్రంథం ఉన్నందున, ఈ నిక్షేపరక్షకు కూడా వేదానికి ఉండే గౌరవం ఉన్నది– అని అంటున్నారు. నిచ్చెనను ఎక్కితే, సౌధంలోని పై భాగంలోకి సులువుగా వెళ్ళవచ్చు. ఆ విధంగానే, ఈ నిక్షేపరక్ష అనే గ్రంథాన్ని అధ్యయనం చేస్తే, వేదంలో ఉండే అగ్ర భాగమైన ఉపనిషత్తులలో ప్రకాశించే శరణాగతి అనే తత్వాన్ని తెలియడం సులభం అవుతుంది– అని దీని అర్థం. ఇక్కడ ఉండే వేరొక సామ్యాన్ని కూడా మనం గమనిద్దాం.

"ప్రజ్ఞాప్రాసాద మారుహ్య" అని ఆరంభం అవుతున్న ఒక శ్లోకం మహాభారతంలో ఉన్నది. " ఒక పర్వతంపై ఉండేవాడు, లేక, ఉన్నతంగా ఉండే ఒక కట్టడంపై ఉండేవాడు భూమిపై ఉండే వస్తువులను అన్నిటిని చూడగలిగేటట్లుగా " అనే దృష్టాంతం ఇక్కడ ప్రస్తావింపబడింది. ఉన్నతంగా ఉండే ఒక పర్వతం పైకి గాని, లేక, ఉన్నతంగా ఉండే ఒక మేడ పైకిగాని ఎక్కినవాడు కింద భూమిపై ఉండే వస్తువులను అన్నిటిని చూడగలుగుతాడు. ఆ విధంగానే, ఉన్నతమైన వేదాన్ని అధ్యయనం చేసినవాడు సామాన్యులకు కనిపించని విషయాలను కూడా దర్శించగలుగుతాడు ఎందుకంటే, అతడు ఉన్నతంగా ఉండే వేదం ద్వారా దర్శిస్తున్నాడు కదా. అందుచేత, ఇక్కడ వేదానికి, సౌధానికి మధ్య ఉండే ఇంకొక సామ్యం కూడా తెలుపబడినట్లు అయినది.

## వేదవైభవం-5

ఇక్కడ, ఇంకొక పోలిక ఏమంటే, ఉన్నతంగా ఉండే సౌధంపైనుండి చూచేవానికి కింద ఉండే వస్తువులు అన్నీ చిన్నవిగా కనిపిస్తాయి. ఆ విధంగానే, వేద సౌధంనుండి చూసేవారికి కింద ఉండే వస్తువులు, అంటే, ఈ భూలోకంలో ఉండే వస్తువులు అన్నీ అల్పమైనవిగా, విలువ లేనివిగా, సారం లేనివిగా తోస్తాయి. పరలోకమే ఉన్నతంగా తోస్తుంది. ఇది కూడా ఒక విధమైన పోలిక.

ఈ విధంగా మనం సౌధానికి, వేదానికి మధ్య ఉండే ఏడెనిమిది విధాలయిన పోలికలను గమనించాం. వాని మూలంగా ఏడు, ఎనిమిది విధాలయిన వేదమహిమలను తెలుసుకొన్నాం. స్వస్తి.